# శ్రీ రామాయణ గానసుధ

## (కిష్కింధాకాండము)



## గ్రంథకర్త పరిచయం

| | |
|---|---|
| గ్రంథకర్త | **పి యల్ నారాయణరావు** |
| స్వస్థలం | రైల్వే న్యూకోలనీ, విశాఖపట్టణం |
| పుట్టిన తేది | 8-11-1940 |
| సతీమణి | సౌ॥ శ్రీమతి గిరిజ |
| తల్లిదండ్రులు | కీ॥శే॥ 'సహజకవి' పంతుల చినజోగారావు<br>కీ॥ శే॥ సుభద్రమ్మ |

**మొదటి సుందరకాండ గానం**

29 2-1992 శ్రీ సద్గురు బ్రహ్మ రామదూత మందిర ప్రాంగణం
మధురానగర్ విశాఖపట్నం

**సన్మానాలు పురస్కారములు**

1974 ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ శ్రీ ఎమ్ ఆర్ అప్పారావు గారు
1980 1984 పద్మశ్రీ ఘంటసాల కల్చరల్ అసోసియేషన్ యలమంచిలి
1981 విశాఖ Insustrial and Commercial Exhibition
1981 Lion Ladies Auxiliary Visakha North
1984 సంగీత సంగమం జమ్‌షెడ్‌పూర్
1985 మద్రాస్ తెలుగు అకాడమీ
1992 Food Corpn of India Ltd
1992 రాగతరంగిణి, బరంపురం
1995 సర్వెంట్సు ఆఫ్ గాడ్స్ సొసైటీ **అభినవ ఘంటసాల**
1996 స్వరరంజని & సమన్వయ సమితి విశాఖపట్నం
**పావని సుందరగానలోల** బిరుదు ప్రదానం
1997 శ్రీ కోరిమిల్లి వీరభద్రరావు మెమోరియల్ & కల్చరల్ & ఎడ్యుకేషనల్ ట్రస్టు యలమంచిలి వారిచే **గురజాడ అవార్డు** 1998 సన్మానం కళావేదిక, విశాఖ
1999 **కళారత్న** బిరుదు ప్రదానం
6-2-2000 చైతన్య స్రవంతి, పర్లాకిమిడి

***ఇతర అముద్రిత రచనలు***

శ్రీ రామాయణ గాన సుధలో బాల అరణ్య
మరియు యుద్ధకాండలు
శ్రీ షిరిడిసాయి అమృత వర్షిణి
లలిత, భక్తి గీతాలమాల

## కృతికర్త దంపతులు



శ్రీ పి యల్ నారాయణరావు శ్రీమతి గిరిజాకుమారి



గ్రంధకర్తకు పావని సుందరగానలోల బిరుదు ప్రదానం గావిస్తున్న
ప్రముఖులు శ్రీ డి వి సుబ్బారావు నగర మేయరు
డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి Vice Chancelor A U
కళాప్రపూర్ణ జి అచ్యుత రామరాజు అధ్యక్షులు ఎస ఖ సి హిత



ఆంధ్ర విశ్వవిద్యాలయం డైమండ్ జూబ్లీ సందర్భంగా శ్రీ ఎమ్ ఆర్ అప్పారావు
గారిచే సన్మానింపబడిన గ్రంధకర్త పి ఎల్ నారాయణరావు
కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారితో



కళాభినేత్రి జమున రమణా రావుగారితో
గళం కలిపి పాడుతున్న గ్రంధకర్త



24 గంటల ఘంటసాల ఆరాధనోత్సవములో
కళాబంధు శ్రీ టి సుబ్బరామిరెడ్డి ఎం పి గారిచే జ్ఞాపిక బహూకరణ (1998)



నటసామ్రాట్ డాక్టరు అక్కినేని నాగేశ్వరరావు గారి దగ్గర నుండి మద్రాస్
తెలుగు అకాడమీ జ్ఞాపికనందుకుంటున్న గ్రంథకర్త



1948 అక్టోబరు 2, గాంధీజయంతి సందర్భముగా ఘంటసాల కల్చరల్ అసోసియేషన్ (తోకాడ) వారి తరుపున గౌ॥ ముందాడు సత్యన్నారాయణ పురపాలక పట్టణాభివృద్ధి మంత్రిచే గ్రంథకర్తకు సన్మానం



తేది 28-12-98 విశాఖరత్న వారిచే కళారత్న' అవార్డు అందుకుంటున్న గ్రందకర్త శ్రీ పి ఎల్ నారాయణరావు

# నా గురించి

కీ శే ''సహజకవి'' పంతులచిన జోగారావు, కీ॥శే॥ సుభద్రమ్మల పదకొండుమంది సంతానంలో నేను మూడవవాడిని నా తండ్రిగారు ''శ్రీమద్రామాయణపారిజాతం'' అను నిర్వచనోత్తర రామాయణమును రచించి దానిని శ్రీ భద్రాద్రి రామచంద్రులవారికి అంకితముగావించి, వారి జన్మచరితార్థము జేసి కొనినారు

చిరుతప్రాయంలో మా తండ్రిగారు నాచెత కుణ్ణంగా ''పెద్ద బాలశిక్ష'', అనేక కవులు వ్రాసిన శతకాలు చదివించారు కాస్త జ్ఞానం వచ్చాక మా తండ్రి గారి పుస్తక భాండాగారంలో నున్న అనేక గ్రందాలు చదివే అవకాశం కలిగింది క్రమేపి తెలగునుడికారం మీదమక్కువ ఎక్కువయింది ఈ మక్కువేనన్ను విద్వాన్ శ్రీ దివాకర్లరామమూర్తిగారికి, ఉభయ భాషా ప్రవీణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి గారికి, శ్రీచర్ల గణపతి శాస్త్రి గారికి, ''కళాప్రపూర్ణ'' గణపతిరాజు అచ్యుతరామరాజుగారికి దగ్గరచేసింది వారి అవ్యాజమైన ప్రేమాశీస్సులు పొందగలిగే అవకాశం కలుగ జేసింది

3 నా 7సం॥ల వయస్సులో గానగంధర్వ, పద్మశ్రీ ఘంటసాల గారు ''లైలామజ్ను'' చిత్రంలోపాడిన ''పయనమయేప్రియతమ ననుమరచిపోకుమా'' అనేపాట నాహృదయంమీద చెరగని ముద్రవేసి అతనికి ఏకలవ్యశిష్యునిగా జేసింది నాకు గానం మీదగల మక్కువ జూసిన నా తల్లిగారు నన్ను అమితంగా ప్రోత్సాహించేవారు ఈనాడు 40 సం॥రాలుగా లలితసంగీత గాయకునిగా వెలుగొందడానికి ప్రోత్సాహించిన నా తల్లిగారికి, తెలుగులోని కమ్మదనాన్ని ఆస్వాదింపజేసిన నా తండ్రిగారికి,

నన్ను కవిగా తీర్చిదిద్దిన నా గురువులందరికీ నేను ఎంతో ఋణపడి ఉన్నాను

నేను మొట్టమొదటిసారిగా ఆగష్టు 15, 1957న పోర్టు జింఖానా దగ్గర కచేరీ చేశాను ఆ తరువాత 1958 అక్టోబరు నెలలో అంతర్ కళాశాల పాటలపోటీలో ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి అంతర్విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలలో పాల్గొనుటకు ఢిల్లీవెళ్ళి నాటి భారతప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, బాబూ జగజ్జీవన్‌రామ్, బూర్గుల రామకృష్ణారావు మున్నగు ప్రముఖులముందు గానంచేసి వారి ఆశీస్సులు అందుకున్నాను తిరిగి 1968వ సంవత్సరంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండి ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి, ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ దేశాల యువజనోత్సవాలలో పాల్గొని నాటి రాష్ట్రపతి శ్రీ వి వి గిరి వారి సతీమణి శ్రీమతి సరస్వతీగిరి వారి కుమారులు శ్రీ శంకర్‌గిరి మరికొంతమంది ప్రముఖులముందు రాష్ట్రపతి భవనంలో పాడి వారి అవ్యాజమైన ప్రేమకు నోచుకున్నాను నాటినుండి నేటివరకు ఈ 42 సంవత్సరంలలో పలు ఆర్కెస్ట్రాల సహకారంతో ఆంధ్రలోను, ప్రవాసాంధ్ర ముఖ్యపట్టణములలో 3000 పైచిలుక లలితసంగీత కచేరీలు చేసే అదృష్టానికి నోచుకున్నాను

1982లో ఉద్యోగరీత్యా నాకు కొన్ని చికాకులు ఎదురై జీవితంమ్మీద విరక్తి కలిగినపుడు, ఒక మిత్రుని సలహాపై శ్రీ ఆంజనేయస్వామివారి పాదాలను ఆశ్రయించాను నాటినుండి ఆయనే నా ఆరాధ్య దైవం, ఆయనే తల్లి, తండ్రి, గురువు స్వామి వారి ఆదేశమో, మహిమో ఒకరోజు శ్రీ సీతారాములకళ్యాణ ఘట్టాన్ని గానరూపంలో వ్రాయగా, అది చదివిన వారు నన్ను

ప్రోత్సహించి మొత్తం రామాయణాన్ని గాన రూపంలో వ్రాయమని సలహానిచ్చారు అది మొదలు ముఖ్యంగా నాతండ్రిగారు రచించిన ''శ్రీ రామాయణ పారిజాతం''ను ఆమూలాగ్రం పఠించి ముందుగా శ్రీ ఆంజనేయ స్వామివారి కృపాకటాక్షవీక్షణాలకు పాత్రుడనవాలని తలచి సుందరకాండము ''శ్రీ పావని సుందరగానసుధ'' అన్న పేరుతో వ్రాసి, ముద్రించి, పాఠకలోకానికి అందించ గలిగాను నేను రాసిన సుందరకాండను, నేనే గానంచేసే మహాద్భాగ్యాన్ని కలుగజేసారు నా సుందరరూపులు ఆంజనేయస్వామివారు

5 ఏనాడు సుందరకాండను పూర్తి చేసి, గానం చేశానో నాటినుండి నాకష్టనష్టాలన్నీ మటుమాయం అయ్యాయి జీవితంలో నేను చేపట్టలేనన్న కార్యక్రమాలన్నీ సునాయాసంగా జరగటం మొదలయ్యాయి **అసాధ్యస్సాధక స్వామిన్, అసాధ్యం తవకింవధ రామదూతకృపాసింధో మత్కార్యం సాధయఃప్రభో** ' అని పఠించి స్వామివారిని మనసా, వాచా కర్మణా నమ్మినవారికి అన్ని జయాలే అపజయాలు చవిచూడరని నా నమ్మకం వ్యాకరణంగాని ఛంద స్సుగాని క్షుణ్ణంగా రాని నేను రామగానాన్ని వ్రాయటానికి నిస్సందేహంగా అనర్హుడను కాని స్వామివారి ఆశీస్సులతోనే శ్రీరామగానాన్ని వ్రాయగలిగేశక్తిని సంపాదించుకున్నాను, దానికి తోడు నిరంతరం నాకన్నా ఎక్కువగా భక్తి ప్రపత్తులతో శ్రీమారుతిని కొలిచేనాసహ ధర్మచారిణి చి॥సౌ॥ గిరిజ నాకు మనోబలాన్ని సమకూర్చి, మిగిలిన బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, యుద్ధకాండములు వ్రాయగలిగేటందుకు శతవిధాల దోహదపడింది అదే విధంగా నా కుమారులు చి॥ శ్రీనివాసరాజశేఖర్, చి॥ ద్వారకావాస్‌కేశవ వారి ధర్మపత్నులు చి॥సౌ॥ ప్రవీణ, చి॥సౌ॥ గాయత్రి, నా కుమార్తె చి సౌ పద్మశ్రీకుమార్,

న్ను కవిగా తీర్చిదిద్దిన నా గురువులందరికీ నేను ఎంతో ఋణపడి ఉన్నాను

నేను మొట్టమొదటిసారిగా ఆగష్టు 15, 1957న పోర్టు జింఖానా దగ్గర కచేరీ చేశాను ఆ తరువాత 1958 అక్టోబరు నెలలో అంతర్ కళాశాల పాటలపోటీలో ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి అంతర్విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలలో పాల్గొనుటకు ఢిల్లీవెళ్ళి నాటి భారతప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, బాబూ జగజ్జీవన్‌రామ్, బూర్గుల రామకృష్ణారావు మున్నగు ప్రముఖులముందు గానంచేసి వారి ఆశీస్సులు అందుకున్నాను తిరిగి 1968వ సంవత్సరంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండి ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి, ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ దేశాల యువజనోత్సవాలలో పాల్గొని నాటి రాష్ట్రపతి శ్రీ వి వి గిరి వారి సతీమణి శ్రీమతి సరస్వతీగిరి వారి కుమారులు శ్రీ శంకర్‌గిరి మరికొంతమంది ప్రముఖులముందు రాష్ట్రపతి భవనంలో పాడి వారి అవ్యాజమైన ప్రేమకు నోచుకున్నాను నాటినుండి నేటివరకు ఈ 42 సంవత్సరంలలో పలు ఆర్కెస్ట్రాల సహకారంతో ఆంధ్రలోను, ప్రవాసాంధ్ర ముఖ్యపట్టణములలో 3000 పైచిలుక లలితసంగీత కచేరీలు చేసే అదృష్టానికి నోచుకున్నాను

1982లో ఉద్యోగరీత్యా నాకు కొన్ని చికాకులు ఎదురై జీవితంమ్మీద విరక్తి కలిగినపుడు, ఒక మిత్రుని సలహాపై శ్రీ ఆంజనేయస్వామివారి పాదాలను ఆశ్రయించాను నాటినుండి ఆయనే నా ఆరాధ్య దైవం, ఆయనే తల్లి, తండ్రి, గురువు స్వామి వారి ఆదేశమో, మహిమో ఒకరోజు శ్రీ సీతారాములకళ్యాణ ఘట్టాన్ని గానరూపంలో వ్రాయగా, అది చదివిన వారు నన్ను

ప్రోత్సహించి మొత్తం రామాయణాన్ని గాన రూపంలో వ్రాయమని సలహానిచ్చారు అది మొదలు ముఖ్యంగా నాతండ్రిగారు రచించిన ''శ్రీ రామాయణ పారిజాతం''ను ఆమూలాగ్రం పఠించి ముందుగా శ్రీ ఆంజనేయ స్వామివారి కృపాకటాక్షవీక్షణాలకు పాత్రుడనవాలని తలచి సుందరకాండము 'శ్రీ పావని సుందరగానసుధ'' అన్న పేరుతో వ్రాసి, ముద్రించి, పాఠకలోకానికి అందించ గలిగాను నేను రాసిన సుందరకాండను, నేనే గానంచేసే మహాద్భాగ్యాన్ని కలుగజేసారు నా సుందరరూపులు ఆంజనేయస్వామివారు

5 ఏనాడు సుందరకాండను పూర్తి చేసి, గానం చేశానో నాటినుండి నాకష్టనష్టాలన్నీ మటుమాయం అయ్యాయి జీవితంలో నేను చేపట్టలేనన్న కార్యక్రమాలన్నీ సునాయాసంగా జరగటం మొదలయ్యాయి ''**అసాధ్యస్సాధక స్వామిన్, అసాధ్యం తవకింవధ, రామదూతకృపాసింధో మత్కార్యం సాధయప్రభో**'' అని పఠించి స్వామివారిని మనసా, వాచా కర్మణా నమ్మినవారికి అన్ని జయాలే అపజయాలు చవిచూడరని నా నమ్మకం వ్యాకరణంగాని ఛంద స్సుగాని క్షుణ్ణంగా రాని నేను రామగానాన్ని వ్రాయటానికి నిస్సందే హంగా అనర్హుడను కాని స్వామివారి ఆశీస్సులతోనే శ్రీరామగానాన్ని వ్రాయగలిగేశక్తిని సంపాదించుకున్నాను, దానికి తోడు నిరంతరం నాకన్నా ఎక్కువగా భక్తి ప్రపత్తులతో శ్రీమారుతిని కొలిచేనాసహ ధర్మచారిణి చి॥సౌ॥ గిరిజ నాకు మనోబలాన్ని సమకూర్చి, మిగిలిన బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, యుద్ధకాండములు వ్రాయగలి గేటందుకు శతవిధాల దోహదపడింది అదే విధంగా నా కుమారులు చి॥ శ్రీనివాసరాజశేఖర్, చి॥ ద్వారకావాస్‌కేశవ వారి ధర్మపత్నులు చి॥సౌ॥ ప్రవీణ, చి॥సౌ॥ గాయత్రి, నా కుమార్తె చి సౌ పద్మశ్రీకుమార్,

నా అల్లుడు శ్రీ దూళిపాటి సుబ్రహ్మణ్యకుమార్ నేను వ్రాసిన శ్రీరామాయణగానసుధను ఎప్పటికప్పుడు అందంగా కాపీచేసి కడు శ్రద్ధతో నాకందించి ఆపావని ఆశీస్సులందుకొన్నారు వారునమ్ముకున్న ఆశయాలకు ఆ పావనపావని అన్ని విధాల సహకరించాడు ఈశ్వరాంస సంభూతుడైన శ్రీ ఆంజనేయస్వామివారు, తననునమ్మిన వారికి, కొలిచేవారికి, సుందరకాండ పారాయణజేసేవారికి, విద్యా, వినయాదులతో బాటు సకలైశ్వర్యాలు కలుగజేస్తాడన్నది నిత్యసత్యం

ఈ కిష్కింధాకాండమును అతి తక్కువ వ్యవధిలో ముద్రించిన శ్రీ శర్వాణి ప్రింటర్స్ వారికి, శ్రీ ఎమ్ ఆర్.ఎల్ గారికి, శ్రీ సత్యశ్యాం గారికి, ఆశీర్వచనం వ్రాసిన ఆచార్య అప్పల్ల సోమేశ్వరశర్మ గారికి, మనోహరంగా ముఖచిత్రం వేసిన శ్రీ ఆళ్ళ సత్యారావుగారికి నా కృతజ్ఞతాభివందనాలు

భక్తిభావంతో వ్రాసిన నా ''రామాయణగానసుధ''ను చదివిన బుధులు తప్పులున్న ఒప్పులుగాగొని వారి ఆశీస్సులు అందజేయ గలరని ఆశిస్తున్నాను నాశేష జీవితాన్ని ''శ్రీరామ గానం'' తో పునీతం చేసుకోవాలని, నా ఆకాంక్ష ఆపై స్వామివారికృప

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఓం శ్రీ పవనతనయాయనమ

## శ్రీవినాయకస్తుతి

శ్రీవినాయకా - పార్వతి తనయ
ప్రమద గణాలకు - అధిపతి వీవు
సకల లోక - నివాసులందరు
నిన్ను ముందుగా - పూజించనిచో
వారి పనులకు - విఘ్నము కలుగును
కావున నిన్ను - నే మది నిలిపితి
శ్రీ రామాయణ - గానము రాయగ
నా కలమందున - నీవు నిలువుమా

## సర్వదేవతాస్తుతి

పాలసంద్రమున - పవ్వళించిన
ఫల్గుణు బ్రోచిన - పార్థసారధికి
మురారి పదములు - మెత్తగ ఒత్తెడి
ముగ్ధమోహన - స్వరూపిణి లక్ష్మికి
సత్యలోకమున - వేద పురుషులకు
శారదామాత - పాటయుగమునకు
భూలోకమున - బుధులందరికి
ప్రణామాంజలు - లర్పించుచుంటిని

## కవిగాయకులకు - నీరాజనము

శ్రీరామాయణ - గానము వినుడి
ముక్తికి దారిదు - సోపానమది
వల్మీక భవుని - వాక్కున విరసిన
వెన్నెల వెలుగు - విభుని చరితము
కాళిదాసుని - కావ్యకన్యక
రఘువంశమె - మన రామ చరితము
తులసీదాసుడు - ధన్యత చెందగ
రామచరితమా - నసను రచించె

రంగనాథుని - అంతరంగమున
అవతరించిన - అయోధ్యపతి కథ
గోపీనాథుని - గుండెల నిండిన
జానకీపతి - జనన చరితము
కవిభాస్కరుని - గంటము నుండి
గలగలపారిన - రామచరితము
మగువమొల్ల - మోదముతో రాసిన
మిథిలానాథుని - అల్లుని చరితము

గాన గంధర్వ - త్యాగరాయుని
గళమున విరి - చిన రామగానము
భక్తకబీరుని - భజనల విలచిన
భరతాగ్రజుని - భవ్యచరితము
**పంతులవారి - వంశసోముడు**
**జోగరాయుని - పారిజాతము**
ఆ కవులందరి - దీవెనలంది
నే రాసితి శ్రీ - రామ గానము

''వ్యాకరణాలంకారచక్రవర్తి'', ''సాహిత్యవిశారద''
**ఆచార్య అప్పల్ల సోమేశ్వర శర్మ**, ఎమ్ ఎ, పి ఓ.ఎల్
(విశ్రాంతసంస్కృతాచార్యులు) - ఆంధ్ర విశ్వకళాపరిషత్

# ఆశీర్వచనము

**''శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువనత్రయమ్''** (రామాయణమనే గంగానది మూడు లోకాలను పవిత్రం చేస్తున్నది) అని ఏనాడో పెద్దలన్నారు ఆమాట అక్షరాల సార్థకం మానవాళి యొక్క మనోవాక్కాయకర్మలను పరిశుద్ధం చేసి, పదికాలాల పాటు నిలబెట్టే ''సామాజికమైన ''జీవగఱ్ఱ'' శ్రీమద్రామాయణం! అందువల్లనే ''రామాయణం నారాయణం'' అని కూడా నేనంటాను అది ''మానవజీవిత పరాయణం'' అని నా అభిసంధి సరే!

భారతదేశంలో రామాయణ గాథ శతసహస్రవిధాల వ్యాపించింది-వ్యాప్తిస్తున్నది - వ్యాపిస్తుంది వాటిలో ''గేయము'' గా రూపొందించి, గానం చేయడం ఒకతీరు అదికూడా అక్కడక్కడ అమలవుతోంది సామాన్యులకు - అతిసామాన్యులకు కూడా ''రామరసాయనం'' ఆస్వాదించి - ఆనందించి - తరించడానికి ఈ తీరు బాగా ఉపయోగిస్తుంది సాహిత్యానికి సంగీతం తోడైతే - బంగారానికి సువాసన అబ్బినట్లే గదా! అసలు రామాయణాన్ని కుశలవులు గానమే చేసినారట!

ఈ తీరులో శ్రీ **పంతుల లక్ష్మీనారాయణరావు** గారు చిరకాలంగా ఆంధ్రదేశంలోనూ, ఇతర ప్రాంతాలలోను ''రామాయణగానాన్ని'' కావిస్తూ, ప్రజలను ఓలలాడిస్తున్నారు వీరి ''**పావనిసుందరగానం**'' అతి ప్రసిద్ధమై అలరారుతున్నది వింతఏమిటంటే - వీరే స్వయంగా ''గేయాలను'' రచించి గానం చేయడం అనగా వీరు ''**వాగ్గేయకారుల**'' కోవలోకి వచ్చినారన్న మాట!

ఇది సాక్షాత్తు ''శ్రీరామాంజనేయప్రసాదము'' అనక తప్పదు వీరి తండ్రిగారు శ్రీ **పంతుల చినజోగారావుగారు** ''సహజకవులు'' వారు ''**శ్రీరామాయణపారిజాతము**'' అనే పేరుతో రామాయణమంతా రచించినారు అది ఈ మధ్యనే ప్రకటితమయింది ఆ విషయంలో కూడా సుపుత్రులైన శ్రీ లక్ష్మీనారాయణరావుగారి ''**మహాదీక్ష**'' వల్లనే సాధ్యమయింది ఆ కావ్యాన్ని నేను ఆస్వాదించి ఆనందించినాను

కాగా - తమ తండ్రిగారి ''సహజకవిత్వం'' వీరికి సంక్రమించిది ఆత్మావై పుత్రకామ్యాసి'' అన్నది వెదం! అయితే తండ్రిగారిది ''**ప్రాచీనకవిత**'' శ్రీ లక్ష్మీనారాయణరావుగారిది ''**నవీనకవిత**'' అంతే! మిగిలిన కావ్య సంపదకు ఏమీలోటులేదు శ్రీరావుగారు మొట్టమొదట ''సుందరకాండము'' గేయంగా రచించి - ఈ మధ్యనే మిగిలిన బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధాకాండములను క్రమంగా పూర్తి చేసినారు వాటిని నేను 'అవలోక'' గా చూచినాను. ఈ ''**కిష్కింధాకాండమును**'' మాత్రం పూర్తిగా - శ్రద్ధతోనే పరిశీలించినాను ఎంతో ముచ్చటగా రచన సాగింది - రంజకంగా ఉంది ఒక్కమాట ఈరచనలో భాషావ్యాకరణ పాండిత్యాన్ని పరామర్శించకూడదు ''భక్తిభావప్రాధాన్యాన్నే'' పట్టుకోవాలి ఇటువంటి రచనల స్వరూపం ఈ విధంగానే ఉంటుంది ఇదొక ''**జానపద సంవిధానము**'' బహుజన ప్రచారమే వీటి తాత్పర్యం (బహుజనహితాయ - బహుజనసుఖాయ'')

శ్రీ లక్ష్మీనారాయణరావుగారు చిరకాలంనుంచి నాకు గల సహృదయమిత్రులలో ఒకరు వీరు అచిరకాలంలోనే మిగిలిన యుద్ధకాండమును పూర్తి చేసి, ప్రకటించి ''**శ్రీమద్రామాయణ గేయ కావ్యకర్తలు**'' గా విలసిల్లుదురు గాక!'' అని మనసార ఆశీర్వదిస్తున్నాను.

''శ్రీసీతారామాంజనేయులు'' వీరి హృదయంలో ఎల్లప్పుడున్ను ఉన్నారు వారే ఈపని చేస్తారు - చేయిస్తారు! ''తదాఽస్తు''!

తేది 1-2-2000 **- ఆచార్య అప్పల్లసోమేశ్వర శర్మ**

# శ్రీరామాయణగాన సుధ

## (కిష్కింధాకాండము)

### 1వ సర్గ

### చిత్రకూటమున సీతను దలచిరాముడు దుఃఖించుట

1 శ్రీరఘురాముడు - చిత్రకూటమున
లక్ష్మణుగూడి - ఆనందముతో
పావనపంపా - నదినిగాంచుచు
ఆ శుభజలముల - కడువికసించెడి
తామరపూలను - కలువపూలను
తేనెల గ్రోలెడి - తుమ్మెదగుంపుల
ఎలకోయిలల - పంచమస్వరముల
ఆలకించుచు - సాగెముందుకు

2 వృక్షశోభితము - పుష్పరాజితము
అయి అలరారెడి - చిత్రకూటమున
తరువులన్నితమ - సుమములు రాల్చగ
ధరణియంతయు - రత్నకంబళిగ
తరువులనల్లిన - లతలన్నియును
పురుషులకౌగిట - నున్న స్త్రీలవలె
నా మనమునకు - దోచుచున్నవని
లక్ష్మణునిగని - రాముడు పలికె

3 కిలకిల రవములు - జేయుపక్షులు
పచ్చికపైన - చెంగునఎగిరే
మృగసమూహముల - వింతచేష్టలు
మధువాసనలిడు - ఫలవృక్షములు
విరివిగబూచిన - మల్లెలు జాజులు
దట్టమైన తరు - శాఖల నీడలు
నాట్యముజేయు - నెమిలుల సొగసులు
గనుచు రాముడు - సాగెవనమున

4 సీతలేని ఈ - వసంతఋతువు
అడవినిగాచిన - వెన్నెలాయెగద
సీతజాడ గన - రాని సమయాన
పనిగొని మరుడు - కడుహింసించెను
కనుగొనుమా ఒక - మయూరమచట
వేరొకమయూరి - కాంక్షనుజూపగ
మరుని బాణముల - కోర్వగలేక
కూజితమ్ములకు - ఏగుచుండెను

5 తరుశాఖలు కడు - పుష్పభరితమై
కలకలలాడుచు - ఊగుచున్నవి
శాఖలనడుమ - పక్షిసంతతులు
మోదముతో క్రీ - డించుచున్నవి
జానకిబాసిన - నన్నుగాంచుచు
కాకముకూసెను - కడుహర్షముతో
నామనమునకా - నందము నొసగెడి
మార్గములేదా - అనుజలక్ష్మణా!

6 ఈనదమందున - పద్మములన్నియు
భూమిజకనులై - గోచరించెను
విరులు వెదజల్లు - గంధవాయువులు
సీతాసతినిస్వ - నముగదోచెను
జానకి గూడి - ఈ వనమందున
సంచరించగా - కోరిక కలిగెను
ఈ కోరికయే - ధరణిజకూడా
కోరుచున్నదని - మనము జెప్పెను

7 హరిణీహరిణ - చయంబులన్నియు
గిరిసానులలో - క్రీడలు సలుపగ
హరిణలోచన - సీతను జూసి
తాపము చెందెడి - నామనమునకు
ఈ వసంతుడు - కలవర బెట్టుచు
మరుబాణములను - వదలుచుండెను
మరుశరములను - నేద్రుంచెదనని
రాముడుపలికె - లక్ష్మణునిగని

8. నవయౌవ్వనము - రూపవిలాసము
చిరుదరహాసము - చంద్రవదనము
కలిగిన నాసతి - తోయజగంధి
ఒక పరిదనుజులు - ఒకపరిమరుడు
కలిగించెడి ఆ - బాధలనడుమ
తననుగాచెడి - నాథుడు లేడని
నాయెడప్రేమచె - నన్నుదలచుచు
దుఃఖముతోతా - నెటురోదించెనొ

9 నేకనుగొందున - చంద్రశాలినను
నేనికవిందున - తేనెపలుకుతను
ఆమెనుపొంది - ఆనందాబ్ధిలో
తేలియాడుట - మరి ఎప్పుడోగద
అనుజా లక్ష్మణ - ఏగుమయోధ్యకు
భరతుని గూడి - సుఖముగ నుండుము
ధారిణిసుతను - గోలుపోయిన
నాతనువున ప్రా- ణములు నిలువవనె

**లక్ష్మణుడు రామునకు ధైర్యంబుజెప్పుట**

10 రామునివ్యదను - గాంచిలక్ష్మణుడు
కడువినయముగా - పలికెనీవిధి
ఓగుణభద్రా - రఘుకులాన్వయా
ధీరులందరూ - దుఃఖజాలమును
త్రుంచివేతురు - కడునిబ్బరముగ
మహితబలముగల - మహనీయుడవు
అల్పునివలె శో - కింపగదగునా
ఊరడిల్లుమో - జగదభిరామ

11 ధరణీతలంబున - ధర్మనిరతులకు
హానిజరుగదని - నీకు తెలియదా
నీధర్మమె కాపా - డును నినుమరి
మంగళదాయిని - మాతసీతను
రక్కసిమూకలు - ఎందుదాచినా
నిశితశరముల - కాహుతిజేసి
చెరవిడిపించి - నీదరిజేర్చెద
ఊరటజెందుము - ఓరఘునందన

12 యతనముజేయక - యాతనబొందిన
పనులుజరుగవు - ఈధరయందున
కావున మానమున - దీక్షవహింపుము
చంచల భావము - విస్మరింపుము
ఉత్సాహము నీ - మనముననింపుము
సకలకార్యములు - జయమగునీకు
నీ వెరుగని ఈ - ధర్మ సూక్తులు
ధరలోగలవా - రఘుకులసోమ

## ౭వ సర్గ

### సుగ్రీవుడు రామలక్ష్మణులను గాంచుట

13 అనుజుడుచెప్పిన - మాటలువినిన
రామునిమనము - ఊరటజెందెను
బాణకృపాణశ - రాసనములనిడి
అనుజులిరువురు - ఋష్యమూకమున
ప్రకృతిశోభల ను- గాంచుచు ఏగగ
సూర్యసుతుడు - ఆ సుగ్రీవుడుగని
శత్రువులనుకొని - భీతినిజెంది
పరుగునబోయి - శిఖరము జేరెను

14 తనమంత్రియగు - వాయుసుతునకు
కబురంపెనుకడు - రయమున రమ్మని
వచ్చినహనుమను - గనిసుగ్రీవుడు
చూడుముపావని - శుభలక్షణులు
శౌర్యపరాక్రమ - తేజులిద్దరు
రాజకుమారుల - బోలినవారు
కరములందు కో - దండములలర
గిరిసానులలో - తిరుగుచుంటిరి

15 సురపతిసుతుడు - నాపై పగగొని
నను హరియింపగ - పంపిన శత్రులో
జటా జినములు - కోదండములతో
కపటవేషమును - వారు ధరించి
నన్నరయుగవా - రిటకువచ్చిరని
నామదిపరిపరి - చెప్పుచున్నది
అనిపలికెడి ఆ - సుగ్రీవునిగని
మారుతిఒకపరి - యోచనజేసె

16 రామలక్ష్మణుల - గాంచినంతనే
తరుచర వీరులు - భీతిని జెంది
గెంతులు వేయుచు - పరుగు పరుగున
సుగ్రీవునివా - రందరు జేర
ఋష్యమూకము న - వానరరాజు
కాలిడలేడని - నీకు తెలియదా
భయము వీడుము - భానుకుమారా
అనిపలికెను ఆ - మరున్నందనుడు

17 హనుమా చనుమిక - వేషముమార్చి
వారికి ముదమును - గూర్చువిధముగా
నేరుపుమీరగ - మాటలాడుమా
మురిపెము మీరగ - ప్రశంసింపుమా
దివ్యశరాసన - ఖడ్గపాణులై
ఏలఇందు తిరు - గాడుచుంటిరో
కడుమెలకువతో - అరసిరమ్మని
సుగ్రీవుండనె - హనుమంతునిగని

(2వ సర్గ సంపూర్ణం)

## 3వ సర్గ

### హనుమంతుడు రామలక్ష్మణులకడకేగుట

18 వానర రూపము - విడచిమారుతి
భిక్షుకరూపము - పూనెక్షణమున
దశరదతనయుల - దరిజేరగనే
దండప్రణామము - లాచరించెను
అటు పిమ్మట ప్ర - జ్ఞానిధిమారుతి
ఎవరు మీరు - ఇట కేలవచ్చితిరి
పంపాతీరవ - నాంతరమ్మున
తిరుగాడుటకు - కారణమేమి

19. మిమ్ముగాంచిన - మరుక్షణమున
అడవియందుగల - జంతు సమూహము
భీతితోఅటునిటు - పరువిడసాగె
పక్షిగణంబులు - నింగికెగసెను
మీతనువులబడి - వచ్చుకాంతులచె
కడుభాసిల్లె స - రోవరనీరము
సురలో సిద్ధులో - రాజఋషివరులో
విశదపరచుడని - మారుతిపలికె

20 అతిసుకుమారులు - అనిమిష తుల్యులు
పద్మపత్రముల - బోలినకన్నుల
కడుసుందరులు - సింహమధ్యములు
జగములన్నియు - ఏలగలిగెడి
శాత్రవభంజన - చతురమతులని
నామనమునకు - దోచుచున్నది
నారవస్త్రములు - జటాజినములు
ధరియించినమీ - అనుజులిద్దరు
భీకరారణ్య - మధ్యమందున
తిరుగాడుటకు - కారణమేమనె

21. సర్వసులక్షణ - లక్షితులార
ఇంతగనే మా - టాడుచుండిన
బదులు పలుకరు - కారణమేమి
వాలితమ్ముడు - సుగ్రీవుండను
కపిపుంగవుడు - వానరశ్రేష్ఠుడు
అన్నకుతోడుగ - సేవలు జేయుచు
నీతిమంతుడై - మెలగుచుండగా
ఇరువురినడుమ - రేగెతగవులు

22 వాలి సుగ్రీవుని - కడుహింసించీ
రాజ్యమునుండి - పారద్రోలెను
తమ్ముని సతిని - తాచెరబట్టె
వాలిని ఎదురిడి - పోరిడలేక
ఓడి సుగ్రీవుడు - పరువిడిపోయి
ఋష్యమూకమున - తలను దాల్చెను
మిమ్ము గాంచిన - క్షణమునందున
మీతో చెలిమిని - జేయగ నెంచెను

23. సూర్యసుతుడు - ఆ సుగ్రీవుండు
పంపగవచ్చిన - మంత్రిని నేను
వాయుసుతుడను - కామరూపుడను
నన్ను పిలుతురు - హనుమంతుడని
సుగ్రీవునకు - మేలొనరింపగ
మారువేషమున - వచ్చితి నేను
దుఃఖితుడైన - వాలి అనుజుని
గాచెడి వారు - మీరలిద్దరని
నామదిపరిపరి - చెప్పుచున్నదనె

**రాముడు హనుమంతుని జూచిపొగడుట**

24 కడుమధురముగా - పలికినమారుతి
పలుకులువినిరఘు - రాముడిటులనె
ఎవరినెయ్యము - గోరివచ్చితివొ
ఆ సుగ్రీవుండె - పంపెనీతనిని
సకలవేదములు - పానము జేసిన
బహు బలశాలి - పండితోత్తముడు
వ్యాకరణంబును - ఆ మూలాగ్రమ
పఠియించెనని - తోచుచున్నది

25 కనులయందు కను - బొమలయందున
ముఖమునందు - లలాటమందున
మిగులు అంగముల - దోషములేదు
మధ్యమస్వరమున - కడుస్పష్టముగ
సంస్కృతంబున - మనోహరముగా
పలికెడి పలుకుల - దోషములేదు
ఖడ్గము కరమున - నిడుకొనివచ్చిన
శత్రువుగూడ - పరవశమొందును
ఈ తనిగాంచిన - క్షణమునందునా

26 ఈతని పలుకులు - వినినవారలు
మరలమరల అవి - వినగోరెదరు
ఇట్టి సద్గుణుడు - దూతగ ఉండిన
సూర్యసుతుడు - అదృష్టవంతుడు
ఈతనిబోలు - దూతదొరకిన
ధరణియందుగల - రాజులందరికి
కార్యములు జయ - సిద్ధిగాంచునని
లక్ష్మణుగాంచి - రాముడుపలికె

27. నవవ్యాకరణ - పండితోత్తమా
ఓ హనుమా విను - నేజెప్పునది
భానుసుతుని - సుగ్రీవుని గూర్చి
ఈ అడవులబడి - తిరుగుచుంటిమి
ఆతని కొరకే - వెదకుచుంటిమి
నీవు నుడివిన - రీతిగ మేము
చెలిమి చేసెదము - సుగ్రీవునితో
అనిలక్ష్మణుడు - పలికె హనుమతో

(3వ సర్గసంపూర్ణం)

## 4వ సర్గ

**లక్ష్మణుడు తమ వృత్తాంతము హనుమకు దెలుపుట**

28 ఇనకులమందున - దశరదరాజు
రాజఋష్షులలో - కడుఉత్తముడు
వర్ణధర్మములు - గతులు తప్పక
పాలించెడికడు - పుణ్యాశీలుడు
వానికి గలరు - ముప్వ్వారుసతులు
కౌసల్య సుమిత్ర - కైకలందురు
సంతతలేమిచె - దశరథరాజు
పుత్ర కామేష్టి - యాగము జేసె

29 యాగఫలముగా - నలుపురుసుతులను
రాణులుకనిరి - కడుమోదంబున
కౌసల్యాసతి - రామునికనెను
భరతుడు జనించె - మాతకైకకు
మాతసుమిత్రకనె - ఇరువురుసుతులను
లక్ష్మణశత్రుఘ్న - నామ ధేయులు
లక్ష్మణుండనే - మూడవవాడను
అని తెలిపెనుతమ - ఉనికి హనుమకు

30. దశరదభూపతి - ప్రదమకుమారుడు
రఘురాముడు - నారాయణ తేజుడు
ధనుర్విద్యలో - అగ్రగణ్యుడు
ఏకసతీవ్రతు - డార్తశరణ్యుడు
సర్వలోకవిఖ్యా - తచరిత్రుడు
ఓర్పునందునా - ధరణిసమానుడు
కీర్తియందుదే - వేంద్రసమానుడు
పితృవాక్యపరి - పాలకుడాతడు

31. వర్ణధర్మముల - నాచరించెడి
సత్యధర్ముడు - శత్రునాశకుడు
రాజనీతిని - తప్పనివాడు
బ్రహ్మచర్యమున - భాసిలువాడు
సాధుజనులను - సాకెడివాడు
రమ్యగుణుండు - శీలవర్తనుడు
సకల వేదముల - సారమాతడు
నిఖిలలోక - ప్రసిద్ధచరిత్రుడు

3 2 తండ్రియానతిని - శిరమునదాలిచి
వన భూములకు - వచ్చెరాముడు
వదినసీతయు - తదుపరినేను
అనుసరించగా - అడవుల తిరుగుచు
జనస్థానమున - సురవిరోధులగు
ఖరదూషణాది - రాక్షసవీరుల
రణమున ద్రుంచి - పంచవటిజేరి
ఆనందముగా - గడపుసమయాన

3 3 దండకమందున - పర్ణశాలదరి
ఒంటిగనున్న - వదినసీతను
దనుజుడెవ్వడో - తస్కరించిజనె
మాతసీతకై - పనిగొని మేము
కాననమందున - తిరుగుచుండగా
కబంధుడనెడి - పేరిటివాడు
శాపవశమున - దనుజరూపుగొని
మా హస్తముల - నిహతుడాయెను

34 శాపవిముక్తిని - పొందికబంధుడు
అనిమిషలోకము - ఏగుసమయాన
ఋష్యమూకమున - వాసముజేసెడి
సూర్యసుతుని - సుగ్రీవునాముని
అగ్నిసాక్షిగా - చెలిమినిజేసి
ధరణిజజాడ - తెలియజేయును
కావున మీరు - వేగమెఏగి
ఋష్యమూకగిరి - చేరుడనియెను

35 ఎవ్వనిచే ఈజ - గములన్నియు
దీప్తివహించి - అలరుచున్నవో
సర్వచరాచర - జీవులనెవ్వడు
ఎల్లవేళలా - బ్రోచుచుంటిడో
అట్టిరాముడీ - రీతిగనేడు
శోకతప్తుడై - సూర్యపుత్రుని
శరణుగోరగా - వచ్చినాడని
లక్ష్మణుడనియె - పవనసుతునితో

36 అటుపలికిన - సౌమిత్రినేత్రముల
జలజలరాలెను - బాష్పకణములు
అంజనసుతుడు - అనుజులిద్దరికి
సుగ్రీవునకు - వాలియొనర్చిన
అన్యాయమ్మును - విశదపరచెను
మిముదర్శించి - సాయముగోరగ
వేచియున్నాడు - సూర్యపుత్రుడని
శ్రీహనుమంతుడు - పలికెరామునితో

**హనుమంతుడు సుగ్రీవునకు రామలక్ష్మణులను పరిచయము చేయుట**

37. కామరూపమున - పెంచెశరీరము
భీమరూపమున - భీకరుడాయెను
మేరుమందర - నగములవోలె
పెంచిన కాయము - తీరుగభాసిలె
అరుణ జ్వాలా - మండితముఖుడు
రామలక్ష్మణుల - ఇరుభుజములపై
ఇంపుగనిడుకొని - ఎగిరిపోయెను
రయమునదించెను - సుగ్రీవునిదరి

38 అటులదిగిన ఆ - సోదరులిరువుర
కొండబండల - ఆసనమిచ్చి
ఓ సుగ్రీవా ఈ - తడురాముడు
నీతో చెలిమిని - జేయగనెంచి
తమ్మునితోడా - వచ్చినాడిటకు
శ్రీరామునిసతి - సీతాసాధ్వని
దనుజుడెవ్వడో - అపహరించెను
కాననములబడి - కాంతనువెదకుచు
నీ చెలిమినిమది - గోరవచ్చిరి.
అని పలికెను ఆ - పవన తనయుడు

39. హనుమచెప్పునది - కడుశ్రద్ధగవిని
మనమునందు - గలశంకనువీడి
క్షణమునందున - మనుజరూపుగొని
రామలక్ష్మణుల - చెంతకుజేరి
యదోచితముగా - సత్కరించెను
నే వానరుడను - మీరు మానవులు
మీ కొరకైనే - వేచియుంటిని
మీ ఆగమమున - ధన్యుడనైతిని
నా ఆతిధ్యము - స్వీకరింపుడని
మరిమరివేడెను - దశరథసుతుల
(4వ సర్గ సంపూర్ణం)

## 5వ సర్గ

**రామసుగ్రీవులమైత్రి**

40 అటుపిమ్మట - సుగ్రీవుడిటులనె
భూనాధాత్మజ - నాతోసఖ్యము
చేయదలంచిన - ఈనాకరమును
ప్రీతిమీరగా - మీకరములనిడి
బాస జేయుమా - ఎపుడు వీడనని
ఆ పలుకులువిని - ఇనకులతిలకుడు
సూర్యపుత్రుని - అక్కున జేర్చి
అగ్నిసాక్షిగా - బాసజేసెను.

41. రామసుగ్రీవులు - పుష్పభరితమగు
తరుఛాయలలో - విశ్రమించిరి
చందనతరువుల - మూలమందున
మారుతి సౌమిత్రు - లాసీనులుగాగ
రవిసుతుడంతట - రఘుకులేశుతో
నేటినుండిమన - కష్టసుఖములను
చెరిసమానముగ - పంచుకొందమని
తనగాధను ఇటు - విన్నవించెను

**రామసుగ్రీవుల సంభాషణము**

42 నా అగ్రజుడు - వాలి అనువాడు
కడువిక్రముడు - బలసంపన్నుడు
నాపై పగగొని - భార్యనుచెరగొని
పురమునుండి నను - వెడలుగొట్టెను
కండబడినచో - వధియించెదనని
పంచకపులు - నన్ననుసరించగా
ఋష్యమూకమున - దాగియుంటిని
నన్నుబ్రోవగా - వేడుచుంటిని

43 అని అర్థించిన - సూర్యనందనుని
గాంచిపలికెను - ఇనవంశాగ్రణి
నీవనితనుచెర - బట్టినవాలిని
నేవధించగ ఎం - చితి మనమున
భీకరరణమున - విగతదేహుడై
నాశరములకు - నేలకొరగును
నీ సతిరుమను - నీదరిజేర్చెద
నీరాజ్యంబున - నినునిలబెట్టెద

**సుగ్రీవుడు సీతాన్వేషణ జేసి రాముని**

**కప్పచెప్పెదనని తెలియజేయుట**

ఓ దాశరదీ - నీప్రతిజ్ఞవిని
నామనమునకు - ఊరటకలిగెను
జనకజవియోగ - గాదయంతయు
పవనతనయుడు - చెప్పగవింటిని
నీసతిసీతను - అపహరించిన
దనుజరావణుని - జాడగనుటకు
కపులనంపెద - అన్ని దిశలకు
సీతామాతను - నీదరిజేర్చెద
అనిసుగ్రీవుడు - రామునిగాంచి
ముదముమీరగా - బాసచేసెను

(5వ సర్గ సంపూర్ణం)

## ౭వ సర్గ

**సుగ్రీవుడు తాను విన్న స్త్రీ ఆర్తరవమును**

**రామునకు వివరించుట**

45 నేనొకదినమున - కపిపుంగవులతో
ఋష్యమూకగిరి - శిఖరమునందున
తిరుగుచుండ స్త్రీ - ఆర్తరవమును
వింటిమిమేము - గగనభాగమున
ఓ! రఘురామా! - లక్ష్మణా! గనుడు
దనుజుడొకడు - ననుఅపహరించెను
ననుకాపాడగ - రారామీరు
అని ఎలుగెత్తి - వగచుట వింటిమి

46 అంతటమమ్ముల - అవలోకించి
చీరచెంగును - క్షణమునచింపి
బంగరు సొమ్ముల - వాసిగగట్టి
మాముంగిటను - జారవిడచెను
ఆసొమ్ములను - గిరికంధరమున
కడుభద్రముగా - భద్రపరచితిని
సతిజానకివో - మరియెవ్వరివో
అవలోకించిన - మీకు తెలియునని

47 ఆని సుగ్రీవుడు - రయమునవెడలి
సొమ్ములమూటను - దెచ్చిచూపెను
అందుమెరసెడి - ఆభరణమ్ముల
జూచి రాముడు - కడుదుఃఖితుడై
లక్ష్మణునిగని - గుర్తింపుమన
వదినపాదములు - మ్రొక్కెడినేను
అందియలను - గుర్తించగలాడను
అని లక్ష్మణుడు - పలికెరాముతో

48 క్రోధరోషములు - ఆవహింపగా
భాస్కరసుతుని - జూచిరఘువరుడు
దనుజుడెవ్వడెం - దుండెడివాడు
శౌర్యధైర్యములు - ఎట్టివాతనివి
వాని నివాసము - ఎచ్చటగలదో
నాసతిసీతను - అపహరించిన
ఆరక్కసుపరి - వారయుతంబుగ
నాశముజేతు - నాశరములతో

(6వ సర్గ సంపూర్ణం)

## 7,8 సర్గలు

**సుగ్రీవుడు రాముని ఉపశమింపుమని కోరుట**

49 రామచంద్రుని - తొందరబాటును
కార్యభారము - సాధనమార్గము
మనమునందు - సుగ్రీవుడు దలచి
రావణుఉనికిని - తెలియబరచిన
రాముడు వెడలును - రావణుద్రుంచగ
రాముడు వెడలిన - వాలిని జంపుట
ఏనాటికిని జరు - గనిపనియుని
సూర్యసుతుడు - అసత్యమాడగా
నిర్ణయించుకొని - ఈవిధిపలికెను

50 ఓపురుషోత్తమ - నిజముచెప్పెదను
ఎరుగనునేను - రక్కసు ఉనికిని
బలసామర్థ్యము - లసలే ఎరుగను
వినుమా ఇదియే - నాశపదమ్ము
నీసతిసీతను - ఎందుదాచినా
బంధుమిత్రుల - పుత్రులందరిని
సంగరమందున - యమపురికంపి
జానకి మాతను - నీదరిజేర్చెద

5 1 ఈధరయందున - నేప్రాకృతుడను
నిజసతివియోగ - తాపసుండను
అయినను మనమున - ధైర్యమూనితిని
సమయముకొరకు - వేచియుంటిని
శాంతివహింపుము - ధైర్యము బూనుము
జితేంద్రియుడవు - మహావీరుడవు
కావున మనమున - శంకనువీడి
కార్యదీక్షకై - కంకణమ్ముగొను

5 2 కడుదుఃఖములు - సంభవించినను
ప్రాణాంతకమగు - భీతికలిగినను
ధన ధాన్యములు - నాశనమైనను
ప్రాణసమానులు - దూరమైనను
మనోబలమును - సంతరించుకొని
క్రుంగికృశించడు - బుద్ధిమంతుడు
అని సుగ్రీవుడు - రామచంద్రుని
ప్రార్ధనజేసెను - ఉపశమించుమని

53 దినకరసూనుని - పలుకులనువిని
రాముడాతనిని - కౌగిటజేర్చి
ఓసుగ్రీవా - సౌమిత్రివలె
నిన్ను జూచెదను - నేటి నుండియు
కష్టనష్టములు - కలుగుసమయాన
ఆదుకొనువాడె - మిత్రుడందురు
అట్టి స్నేహితుని - పొందితినేడు
చింతనుబాసి - శాంతినొందెద

54. పంకజబాంధవ - తనయునిగాంచి
రామచంద్రుడు - ఇటులపలికెను
నీ అగ్రజునకు - నీకును వైరము
ఏ విధికలిగెనో - వినగోరితిని
ఇసుమంతయును - సందేహించక
తేటతెల్లముగ - తెలియబరచుము
అనురఘురాముని - పలుకులువినిన
సుగ్రీవునిమది - వికసితమాయెను

(7, 8 సర్గలు సంపూర్ణం)

## 9వ సర్గ

**్రీవుడు వాయు మయుల యుద్ధ వృత్తాంతము**
**ముునకు దెలుపుట**

5 నా అగ్రజుని - అన్ని సమయముల
వినయముతో -నే గొలిచెడివాడను
కాలమాగతిని - గడచుచుండగా
దుందుభితనయుడు-మయుడనువానికి
నా అగ్రజుడగు - ఇంద్రసుతునకు
మహిళమూలమున - కలహము రగిలె
ఒకనడిరాతిరి - ఆ మాయావి
కిష్కింధాపురి - నగరద్వారము
దాపులనిలచి - పోరుకుపిలచెను

6 వాలిరణమునకు - ఏగుచుండగా
తారయునేను - వారించితిమి
మావిన్నపము - బయటకునెట్టి
పెనుగదబట్టి - పోరుకు వెడలెను
సోదరునంటి - నేనేగితిని
మమ్ముగాంచిన - మయుడు అంతట
కాననమందున - పరుగిడిబోవ
వానిని తరుముచు - మే మరిగితిమి

57. అదిగాంచిన ఆ - అసురుడు భీతితో
దరిలోనున్న - పర్వతమందలి
ఒకబిలమ్మున - దూరెక్షణమున
బిలమునజొచ్చిన - దనుజునిజూచి
అనుజుడువాలి - ఈవిధిపలికె
రయమునబోయి - దనుజునిద్రుంచెద
అంతదనుకనీ - విటనేయుండుము
అనుచుబిలమున - బిరబిర చనెను

58 అటుపిమ్మటనే - వేచియుంటిని
వత్సరకాలము - అనుజుని కొరకు
ఒక దినంబున - భయంకరంబగు
పిడుగులవంటి - ముష్టిఘాతములు
ఉరుములబోలిన - పెను గర్జనలు
బిలమునుండి - కడుభీతిగవచ్చి
నాలుగుదిక్కులు - ప్రతిధ్వనించగ
రక్తము ఏరుగ - పారుటగాంచితి

5 9 మయునికరముల - వాలిమడిసెనని
బలమునశించి - వాలిజచ్చెనని
దనుజులంతట - సంతసించగా
శోకతాపమున - మునిగిపోతిని
వాలినిజంపిన - దనుజుడుతిరిగి
బిలమార్గమున - వచ్చుననిదలచి
భూసమానమగు - శిలనుగ్రహించి
బిలమార్గమును - గ్రక్కునగప్పితి

60 అనుజుని పేరిట - తర్పణవిడచి
కిష్కింధాపురి - జేరుకొంటిని
జరిగినదంతయు - కడువివరంబుగ
అమాత్యులకు - నే విశదబరచితి
రాజులేని ఏ - రాజ్యమైనను
అరాజకముల - పాలుబడునని
మంత్రులందరూ - నిర్ణయించుకొని
కిష్కింధకు నను - రాజుగజేసిరి

(9వ సర్గ సంపూర్ణం)

## 10వ సర్గ

**సుగ్రీవుడు వాలివిరోధవృత్తాంతము రామునికి జెప్పుట**

6 1 నేనటుపాలన - జేయుచుండగా
దనుజునిదునిమి - వాలివచ్చెను
నను గాంచినతా - నుగ్రుడాయెను
పలుపలువిధముల - ననునిందించెను
కాళ్ళపడితిని - గడ్డమంటితిని
నాలోదోషము - లేదని తెలిపితి
నేవిన్నదియు - జూచినదంతయు
కడువినయముగా - విన్నవించితి

6 2 రాజ్యభారమును - స్వీకరింపుమని
పలురీతులనే - బ్రతిమాలితిని
అయినను ఆతని - మనముననిలచిన
దురితభావము - మార్పగనైతిని
పంతము బూని - ఆప్తుల మంత్రుల
మిత్ర బృందముల - చెరయందుంచెను
వాపతి రుమను - తాహరియించెను
నన్ను రాజ్యమును - వీడిపొమ్మనెను

63 నేనపరాధము - జేసిఎరుగను
మోసపుబుద్ధి - లేదుమనమున
మునిశాపముచే - ఇటుకురాడని
ఋష్యమూకమున - దాగియుంటిని
అన్యాయంబుగ - నన్నీరీతిగ
జేసిన వాలిని - తుదముట్టింపగ
అభయమునిచ్చి - నాప్రాణమును
కాపాడగనిను - శరణుజొచ్చితి

(10వ సర్గ సంపూర్ణం)

## 11వ సర్గ

**సుగ్రీవుడు వాలిశక్తిని రామునకు దెలుపుట**

64 - నా అగ్రజుని
బలపరాక్రవి - క్రమములు తెల్పెద
అదివినినీవు - ఉపాయమెంచుము
వానరేశ్వరుని - వాలిని జంపగ
తూర్పునభానుడు - ఉదయించెడితరి
వాలిఏగును - నలుదిశలకును
సర్వవారిధుల - అర్ఘ్యములొసగి
భానుడు వెడలక - మునుపేవచ్చును.

65 ధరణియందుగల - గిరిశిఖరముల
తనభుజములతో - బంతులవోలె
ఎగురవేయుచు - కరములబట్టి
కడులీలగ అత - డాడుకొందుడు
వేరులతోసహ - భూరుహములను
పెకళించి అవి - ఖండన జేయును
అతని పాదముల - నలిగిన శిలలు
మారు చూర్ణముగ - క్షణకాలమున

**సుగ్రీవుడు దుందుభివృత్తాంతము రాముసకు దెలుపుట**

66 బ్రహ్మావరముచే - బలగర్వితుడగు
దుందుభియనెడు - దనుజుడొక్కడు
సాగరుజేరి - పోరుకురమ్మన
పోరుకు నీతో - తగనివాడను
పోయిపిలువుమా - ఆహిమవంతుని
అతడేనీకు - సరియగు జోడు
అనిసాగరుడు - పలుకగావిని
ఓడెసగరుడని - దుందుభితలచెను

67 హిమగిరిశిఖరిని - దుందుభిజేరి
గండశిలలను - నుగ్గుజేయుచు
పోరుకుపిలచెను - హిమవంతునిగని
శాంతచిత్తుడై - గిరిరాజిటులనె
మునిపుంగవులకు - తపోధనులకు
ఆశ్రయమిచ్చుట - నాదుధర్మము
నీతో రణమును - జేయగలేని
కడు అశక్తుడను - నన్నువీడుమన

68 హిమవంతునిగని - దుందుభి అడిగె
నాతోసమముగ - రణముజేసెడి
వీరుడెవ్వడీ - ధరణియందున
అని ప్రశ్నించగ - ఆనగరాజు
భూరిబలుడు - కడువిక్రమశాలి
మహేంద్రసుతుడు - వాలియనువాడు
కిష్కింధాపతి - వానరేశ్వరుడు
నీతోపోరుకు - సరియగు వాడనె

**దుందుభి వాలితోయుద్ధమొనరించుట**

69 వేయిఏనుగుల - బలముకలిగిన
దుందుభియను - ఆ మహిషాసురుడు
ఒకదినంబున - నిశిసమయంబున
కిష్కింధాపురి - ద్వారముజేరి
సింధురభంగి - తరువులగూల్చి
దుందుభివలె - కడుఘోషజేయుచు
పాకాంతసుతుని - పోరుకురమ్మని
గేలి జేయుచు - పిలువసాగెను

70\. అంతఃపురమున - తారలగూడి
మన్మదక్రీడల - ఉన్నవాలివిని
ఓమందమతి - నీవుదుందుభివి
ఊపిరితోనీ - వుండదలచిన
సింహద్వారము - వీడుమువేగమె
అటులకాదేని - ఈక్షణమందే
భువిపైనూకలు - చెల్లునునీకని
వాలిపలికె ఆ - దుందుభికనుగొని

71\. ముదితలగూడి - రమించువానిని
నిద్రమత్తులో - మునిగినవానిని
ప్రగల్భములను - పలికెడివానిని
రణమునందునే - కూల్చ జాలను
అటునేజేసిన - భ్రూణహత్యగా
తలపోతునునా - మనమునందునా
కావుననీవు - నేటిరాతిరి
సతుల గూడిసుఖ - నిదుర చేయుమన

72 పటురోషమ్మున - కిష్కింధాపతి
పోరుకుతాను - కడుసిద్ధమ్మనె
ఇరువురినడుమ - భీకరమైన
పోరుచెలరేగె - ఆనిశియందు
వాలి దుందుభిని - త్రిప్పివిసరగా
రక్తముగారెను - నవరంధ్రములా
ముష్టిఘాతముల - దనుజునిద్రుంచి
కాయమువిసరెను - యోజనదూరము

***మతంగ మహాముని వాలిని శపించుట***

73 కుప్పగ కూలెను - దుందుభికాయము
మాతంగముని - ఆశ్రమంబున
ఆగ్రహమొందిన - మునిపుంగవుడు
జ్ఞాననేత్రమున - అంతయుకనుగొని
ఆశ్రమంబు - అపవిత్రముజేసిన
వాలి ఏనాడు - అందుకాలిడిన
మృత్యువాతపడి - యమపురి కరుగని
మునిశాపమిడె - అతిఘోరముగా

74 మునిశాపంబున - ఆమడపరిధిలో
ఉన్నఈగిరికి - వాలిరాలేడు
కావున నేను - ఋష్యమూకమున
ఆశ్రమమొకటి - నిర్మించుకొని
పవనతనయుడు - సచివాదులును
వెంటనుండగా - గడుపుచుంటిని
వాలిబలమునే - విన్నవించితిని
నీదు బలమునే - జూడదలచితిని

75 అనిపలికెడి ఆ - సుగ్రీవునిగని
చిరునగవులతో - రాముడు లేచి
చూడదలచితివ - నాదుశక్తిని
అనుచుజేరెను - దుందుభిశవమును
కాలి అంగుటకళే - బరమునులేపి
దశయోజనములు - విసరివేసెను
అదిగాంచిన ఆ - సూర్యనందనుని
మదిలోకలిగెను - ఒక సంశయము

76 వాలివిసిరిన - దుందుభికాయము
వేయి ఏనుగుల - బరువు కలిగినది
నేడు రాముడు - విసిరినశవము
సారములేని - అస్థిపంజరము
దానికి దీనికి - పోలికలేదు
కావునరాముని - ఘనతేమున్నది
అని సుగ్రీవుడు - యోచనజేసి
మరియొకకోరిక - కోరెరాముని

77 పూర్వమందున - సప్తశాలములు
ఒకేపోటుతో - గూల్చెనువాలి
అదే రీతిగ - ఒకే శాలమును
ఒక్కశరంబున - నీవు గూల్చగా
కన్నులార నే - గాంచగ నెంచితి
వాలిబలంబును - నీదుబలమును
తూకంబునునే - గట్టిగ నెంచితి
అని సుగ్రీవుడు - కోరెరాముని

(11వ సర్గసంపూర్ణం)

## 12వ సర్గ

**రాముడు సప్తశాలముల దునుముట**

7 8 దినకరునందను - కోరికదీర్పగ
దశరదసుతుడు - దివ్యాస్త్రమును
ఆకర్ణాంతము - లాగివదలగా
ఘోరటంకృతి - నినదమువలన
అష్టదిక్కులు - పిక్కటిల్లగ
సప్తశాలముల - వరుసగగొట్టి
కొండను జీల్చి - భూమిని జీల్చి
సరగునవచ్చి - తూణముజొచ్చె

**రాముడు సుగ్రీవునకు వాలితో పోరుమని జెప్పట**

7 9 అదిగాంచిన ఆ - సూర్యనందనుడు
కరములు మోడ్చి - రఘురామునితో
ధన్యుడనైతిని - నీదుమైత్రితో
రణమునందున - వాలిని గూల్తువు
నాఖేదమును - రూపు మాపెదవు
అనవినిరాముడు - సుగ్రీవునిగని
పోదముపద - కిష్కింధకు ఇపుడె
వాలిని పోరుకు - రమ్మని పిలుమనె

80. ఇనజుడుమార్గము - జూపుచుండగా
రామలక్ష్మణా - హనుమదాదులు
కిష్కింధాపురి - జేరబోయిరి
మార్గమధ్యమున - వృక్షజాలముల
నిండినవనమున - దాగియుంటిరి
ముందుగబోయిన - భాస్కరసుతుడు
కిష్కింధాపురి - నగరద్వారము
జేరివాలిని - పోరుకురమ్మనె

81 అదివినివాలి - రయమునవచ్చెను
అరచేతులతో - చరచుకొనుచును
మోకాళ్ల తోడ - కుమ్ముకొనుచును
ఎగిరికాళ్లతో - తన్నుకొనుచును
నఖములతనువులు - రక్కుకొనుచును
కోరలతోడ - చీల్చు కొనుచును
వాలిసుగ్రీవులు - కడు భీకరముగ
రణము జేసిరి - ఆ సమయంబున

82. కరములచాపము - బూనినరాముడు
తరువులచాటున - మాటువేసెను
వారి రూపములు - వారిగాత్రములు
శౌర్యధైర్యములు - చేవతనమును
ఒకటిగనుండుట - తాగమనించెను
వాలివవడో సు - గ్రీవు డెవ్వడో
తెలియగ లేక - అస్త్రము వేయక
రామచంద్రుడు - ఊరకయుండెను

83. రక్తముచిందెడి - దేహము తోడ
వాలిచేతతా - నిహతుడగునని
భయకంపితుడై - భాస్కరసుతుడు
రణభూమివిడి - పరుగులుదీసి
ఋష్యమూకగిరి - చేరిదాగెను
రామలక్ష్మణ - హనుమదాదులు
పరుగు పరుగున - వెంటవచ్చిరి
సుగ్రీవునిగని - పరితపించిరి

**సుగ్రీవుడు రాముని నిందించుట**

84 రామునిగనిసు - గ్రీవుడంతట
రక్తముచిందెడి - దేహము తోడ
అవమానముతో - మోమును వాల్చి
బాష్పనయనాల - గద్గదస్వరమున
నిన్నునమ్మినే - వాలినిపిలువగ
ఏల ఆతనిని - ద్రుంచవైతివి
అనవినిరాముడు - తన సంశయము
సుగ్రీవునకు - విశదపరచెను

85 భ్రాతృసమానా! - ఓ సుగ్రీవా!
నా పలుకులను - విశ్వసింపుము
వాలియునీవును - ఒకటిగనుంటచె
శరమును ఒదలక - వెనుకాడితిని
భయమొందితి నే - ఏమగునోయని
దానికి మార్గము - యోచన జేసితి
మరలనీవునీ - అగ్రజుజేరి
ఆజికిరమ్మని - రయమునపిలువుము

8 6 **సుగ్రీవుడు మరల వాలినియుద్ధమునకు పిలచుట**

గజపుష్పలతిక - దాల్చికంఠమున
దానిని గురుతుగ - నేజేసుకుని
వాలిని ద్రుంచి - నినుకాపాడెద
అనిదీవించి - పంపెరాముడు
భానుకుమారుడు - రెండవసారి
వాలిని పోరుకు - రయమునరమ్మన
ఆజికివాలి - బయలువెడలగా
తారఅడ్డుపడి - ఈ విధిపలికె

(1 2 వ సర్గ సంపూర్ణ)

## 13,14,15వ సర్గలు

**తారవాలిని యుద్ధమునకు పోవలదని వారించుట**

87 ప్రాణనాధనా - పలుకులు వినుము
భానుకుమారుని - బలముజూచితిని
ఇపుడిపుడేగద - సత్త్వహీనుడై
కదనమునుండి - పరువిడిపోయెను
ఘడియలోనెతా - తిరిగివచ్చెను
పోరుకురమ్మని - పిలుచుచుండెను
దీనివెనుక ఒక - మోసమున్నదని
నామదిపరిపరి - సందేహించెను

88 ఈనడిరేయి - పోరుకు పోవుట
సరికాదనినే - మనవి జేతును
అరుణోదయము - అయినపిమ్మట
అరుగుమునీవు - రణముజేయగ
అంతలో౯ాగి - కీర్తితరుగదు
సుగ్రీవునకు - కీర్తిపెరుగదు
కావుననామన - మాలకించుమని
తారకోరెను - వాలిని జేరి

8 9 దశరథతనయులు - రామలక్ష్మణులు
వరపుత్రులు సక - లాస్త్రశస్త్రులు
జనకుని ఆనతి - దీర్చునెపమ్మున
వనభూములబడి - వచ్చినారట
సుగ్రీవునితో - చెలిమిని జేసి
ఋష్యమూకమున - విడిదిజేసిరని
అడవిమార్గమున - వచ్చుచుండగా
మన అంగదునకు - వేగులు తెలిపిరి

9 0 రామునితోడ - వైరమునీకు
కీడు చేయునని - తలచుచున్నది
యోచన జేసితి - వైరముతొలగగ
ఆవిధిజేసిన - మేలు కలుగును
సుగ్రీవునియువ - రాజును జేసి
ప్రేమమీరగా - గారవించిన
రఘురామునితో - కలహముతొలగును
శుభములు కలుగు - కిష్కింధకనె

(1 3 , 1 4 , 1 5 సర్గలు సంపూర్ణం)

## 16వ సర్గ

**తారహితవును వాలి తిరస్కరించుట**

91. ఓ చంద్రముఖి - నాపై నున్న
మోహముచేసీ - వటులపలికితివి
నన్నురణమునకు - పిలచువానిని
సోదరుడనినే - నెటుతలంతును
ఈ ధరయందున - శౌర్యధనులు
పోరుకురమ్మని - ఎవరుపిలచిన
రణరంగమున - శత్రునెదుర్కొని
గెలుపో ఓటమొ - తేల్చుకొందురు

92 దశరదరాముడు - కీడుచేయునని
నీమనమందున - ఏలతలచితివి
సర్వ ధర్మరక్షా - మహనీయుడు
విశాలహృదయుడు - ధీరుడాతడు
అమహనీయుడు - హానిజేతుడని
నేమనమ్మన - దలచగలేదు
నన్ను రణమ్మున - చంపగనాతడు
అధర్మపద్ధతి - ఏలగైకొనును.

9 3 ఓ భార్యామణి - బదులుచెప్పకు
మారు బలికినచో - నాపై ఆన
అనుచువాలిసు - గ్రీవునెదుర్కొని
రణమునందునా - దెబ్బలకోర్వక
పరుగులిడితివి - ప్రాణభీతిచే
ఏరాఇదియా - నీపరాక్రమము
మరచితివానా - ముష్టిఘాతములు
రమ్మురణమునకు - సంసిద్ధుడనని
ఇంద్రసుతుడు - ఆ సూర్యసుతునితో

**వాలి సుగ్రీవుల రెండవ సారియుద్ధము**

9 4 కాంచనీయమగు - కుసుమమాలతో
తనువు మెరయగా - వాలివెడలెను
గజపుష్పలతిక - కంఠమునలరగ
సుగ్రీవుడు ఎదు - రేగినిలచెను
కరముల గదలను - బూనినవారు
కడుక్రూరముగా - బాదుకొనినారు
సాలవృక్షముల - బండశిలలతో
అతి భీకరముగ - రణమును జేసిరి

95 అటుపిమ్మటవారి - రువురు ఒకటిగ
మల్లయుద్ధమున - కుపక్రమించిరి
వాలి సుగ్రీవుని - ముష్టిఘాతముల
పలుమారులు - హింసించసాగెను
వాలికి బలము - పెరుగుచుండగ
సుగ్రీవునకు - బలము తరిగెను
మాటిమాటికీ - దిక్కులుజూచుచు
సుగ్రీవుడుకని - పించెతూలుతూ

**రాముడు వాలిని గూల్చుట**

96 కిష్కింధాపతి - వాలిప్రాణములు
హరియించెడి ఒక - పటుశరమ్మును
చాపమందుసం - ధించిరాముడు
అదనుకొరకు - తావేచియుండెను
రాముని కరమున - జారినశరము
దేవేంద్రునివ - జ్రాయుధమువలె
వాలి ఉరంబున - రయమున జొచ్చుగ
భూరుహమువలె - వాలిగూలెను.

(16వ సర్గ సంపూర్ణం)

## 17వ సర్గ

**రాముడు కూలిన వాలిని జూచుట**

97 ప్రళయకాలమున - కాంతిహీనుడై
పడియుండెడి ఆ - భానునిపగిది
సురవాసమున - సుకృతమువీడి
అవనిని గూలిన - అయయాతిగతి
సింహవక్షుని - వానరసింహుని
హేమమాలవి - శేషప్రభావుని
మహేంద్రసుతుని - జూడగవచ్చెను
అనుజలక్ష్మణుని - గూడిరాముడు

**వాలి రాముని దూషించుట**

98 తనను జూడగ - వచ్చురాముగని
కీశకాంతుడు - ధర్మయుతముగా
కడుమృదువుగను - కడుకటువుగను
పలుపలురీతుల - పలికెనీవిధి
రామా నీవు న - రేంద్రసుతుడవు
గుణవంతుడవు - కులీనుండవు
సత్తేజుండవు - కీర్తిమంతుడవు
కడుప్రసిద్ధుడవు - కారుణ్యమూర్తివి

99 దశరదనందన - నా అనుజునితో
ధర్మయుద్ధము - జేయుసమయాన
కపటబుద్ధితో - తరువును అడ్డిడి
నిశితశరమున - ఏలగూల్చితివి
నేనెన్నడునిను - గాంచలేదుగద
నీకపకారము - దలుపలేదుగద
శత్రుత్వమున - మధ్యలేదుగద
రాముడు కరుణా - సముద్రుడందురు
ఆ మాటలు కడు - బూటకమాయెను
అని దూషించెను - వాలిరాముని

100 పచ్చికపరచిన - పెనుబావివలె
నివురుగప్పిన - నిప్పుకణికవలె
ధర్మవేషమున - ధర్మబుద్ధితో
తిరుగుచుంటివి - సత్పురుషునివలె
మాయలమారివి - నీవనితెలియక
నిజసతిచెప్పిన - విస్మరించితిని
నన్నుగూలిచి - పాపుడవైతివి
మునివేషమ్మిక - తగదునీకనె

101 వనమునందుగల - ఫలమూలములను
తినితిరుగాడెడి - మృగమునునేను
నాచర్మముధరి - యింపగరానిది
నామాంసముభు - జియింపగరానిది
ధరలోరాజులు - జేతురురణమును
వారితొసరియగు - జాతితోడను
నీవునరుడవు - నే వానరుడను
మాటు వేసినను - ఏల గూల్చితివి

102 భానుసుతుడు - నా ప్రియసోదరుడు
కోపమొచ్చిన - కొట్టు కొందుము
రాజ్యకాంక్షచే - చంపు కొందుము
పిలువకయే మా - మధ్య చేరితివి
నీతిమాలిన - పని జేసితివి
నివురుగప్పిన - నిప్పును వోలె
తిరుగుచుంటివి - ధర్మాత్మునివలె
అని నిష్ఠురముగ - వాలిపలికెను.

103 చిత్తుగమధువును - గ్రోలి నిదురెడి
మనుజుని నాగు - పొడిచిన రీతిగ
నాకు ఎదురుగా - నిలువగ లేక
చాటున పొంచి - నన్ను గొట్టితివి
ఎదురుగనాతో - రణమును జేసిన
బంపెడివాడను - యమపురి జూడగ
దాహముతో నో - రెండుట చేత
ఉరమున శరము - బాధించుటచే
ఒక్క క్షణంబు - వాలిసొమ్మసిలి
తిరిగి తేరుకొని - ఈవిధి పలికెను

104 ఓ రఘునందన - దేనిని గూర్చి
తపనాత్మజుతో - చెలిమి చేసితివి
ఆ విషయమ్మును - నాకు దెలిపిన
లంకానాధుని - రణమున ద్రుంచి
సీతను నీదరి - జేర్చెడి వాడను
ఆదశకంఠుని - బలదర్పములను
మడయించితి గత - మందుననేనని
వాలిరాముని - గాంచి పలికెను

(17వ సర్గ సంపూర్ణం)

## 18వ సర్గ

**రాముడు వాలికి మనుసూక్తులు దెలుపుట**

105. వాలి దూషణలు - వినినరాముడు
ధర్మార్ధకామ - లౌకికంబులగు
విషయములన్నీ - బోధజేసెను
బుధులసూక్తుల - భావములెరుగక
చాపల్యమున - దూషించితివి
మనుజుల మృగముల - కొండల అడవుల
పక్షుల సహితము - ఇక్ష్వాకువులు
ఏలెడి ధరయిది - ఇంద్రకుమారా

106. ఇక్ష్వాకులు కడు - ధర్మనిరతులు
సుక్షత్రియులు - ఋజుశీలురును
నాసోదరుడు - భరతుడను వాడు
ఈ భూమిని ఇపు - డేలుచుంటిడి
దుష్టశిక్షణా - శిష్టరక్షణా
గావించుటయే - క్షత్రియధర్మము
గావుననేను - అనుజ లక్ష్మణుడు
ధర్మంబును కా - పాడ దలచితిమి

కిష్కి - 18 - 10-12

107. తండ్రియు అన్నయు - విద్యాగురువులు
ధర్మాత్ములకు - పితృసమానులు
పుత్రుడు తమ్ముడు - విద్యార్థియును
ధర్మవర్తులకు - పుత్రసమానులు
కోడలు మరదలు - సోదరీమణులు
ధర్మమూర్తులకు - పుత్రిసమానులు
అని శ్రీరాముడు - పలు ధర్మములను
వనచర వీరుకు - విశదపరచెను.

108 తనకుమార్తెతో - తమ్మునిభార్యతో
సోదరితో - క్రీడించువానికి
మరణదండనే - ధర్మమార్గమని
మనువు జెప్పెను - ధర్మశాస్త్రమున
తమ్ముని భార్యను - చెరగొనినీవు
కామాంధుడవై - కలియుచుంటివి
ఈ ధరయందున - కడుపాపుడవు
కావుననిన్ను - శిక్షించితి ననె

109 ఈ ధరయందున - పాపకర్మ్మలను
శిక్షించుట నర - పతుల హక్కు గద
అట్టిపాపులను - శిక్షంపనిచో
ఆ పాపము నర - పతులకు జేరును
పాపినిరాజు - తుదముట్టించిన
పాపికిపాపము - తొలగిపోవును
అటుపిమ్మట ఆ - పాపిజేరును
నాకవిభుని స - దనంబు చెంతకు

110 అదియునుగాక - వేరొకధర్మము
నేజెప్పెదను - ఆలకింపుము
వలలను పన్ని - ఉరులు బిగించి
నేలనుత్రవ్వి - మాటునువేసి
వనమృగంబుల - వేటజేయుట
ధరణీపతుల - విధ్యుక్తధర్మము
నే ధరణీశుడ - నీవు మృగమువు
కావుననిను నే - వేటాడితినని

**వాలి రాముని క్షమింపవేడుట**

111 రామునిపలుకులు - విని ఆ వాలి
ఓ! భద్రగుణా - నిన్ను దెలియక
నిందించితిని - ఎన్నోరీతుల
నా దోషములను - మన్నింపుమయా
అనుచు ఆవాలి - రామునికరమున
అంగదునుంచి - పలికెనిట్టుల
నాకు అంగదుడు - ఒకడేసుతుడు
కడుమక్కువగా - పెరిగెనువాడు

112 భరతలక్ష్మణ - శత్రుఘ్నులపై
నా అనుజుడగు - సుగ్రీవునిపై
అనురాగమును - ఎటుచూపెదవో
జనకుడులేని - నాఅంగదుపై
నీవు జూపుము - సమానురాగము
భాసురశీల - నాసతితార
దోషమెరుగనిది - దయతోచూడుము

113. కడుదుఃఖముతో - కరములు ముడిచి
అటులవేడెడి - వాలిని కనుగొని
వనచరాగ్రణీ - విశ్వసింపుము
తారఅంగదుల - క్షేమముజూచెద
చేసితివీవు - చెడుకార్యమును
దండింపబడి - శుద్ధుడ వైతివి
శోకము మోహము - భయమును వీడుము
స్వర్గధామము - పొందెదవీవనె

(18వ సర్గ సంపూర్ణం)

## 19వ సర్గ

**వాలి అంగదుని రాముని కప్పగించుట**

114. వాలిపడుటగని - వానరులందరు
కిష్కింధాపురి - రయమునజేరి
వాలిసతియగు - తారకు జెప్పిరి
దండధరుండే - రామురూపుగొని
వనచరనాధుని - శరముల గూల్చెను
కాచుకొనుము నీ - తనయునంగదుని
అనిపలికెడి ఆ - కపులమాట విని
తార రోదించి - ఈ విధిపలికెను

(19వ సర్గసంపూర్ణం)

## ౨౦వ సర్గ

**తారవాలిని జూచి దుఃఖించుట**

115 దేవేంద్రునితో - బోలినవానిని
మదకరిబోలు - మహాకాయుని
త్రుంచబడిన ఒక - భూరుహమువలె
కటికనేలపై - గూలినవానిని
మహాధీరుని - మహాతేజుని
పశ్చిమాద్రిని - భానుని బోలెడి
రుధిరధారల - నడుమను పడిన
పతినిగాంచి - రోదించెనుతార

116 మందిరమున ఉ - ద్యానవనంబున
ఎవ్వరిగూడినే - ఇక విహరింతును
గంధసుమములు - ప్రేమ మీరగా
అనుదినము నా - కెవరు ఇత్తురిక
ఓప్రాణేశ్వరి - అనుచు ఈ ధరను
కడుప్రీతిగయిక - ఎవరు పిలుతురు
నా హృదయేశుని - ఆగమనమునకు
ద్వారముకడనే - నెటులనిలతును

117. తనపతి వాలిని - అక్కునజేర్చి
చూడుడువీడె - మన అంగదుడు
గారముతోడ - బెరిగినవాడు
సౌఖ్యమెన్నడు - వీడనివాడు
ఏనవదనుడై - మీదరి నిలబడె
ఒకపరిమీరు - కనులు తెరువుడు
తనివిదీరగా - చేరదీయుడు
అని తనపతితో - తారపలికెను

(20వ సర్గసంపూర్ణం)

## 21వ సర్గ

**హనుమంతుడు తారకు కర్మయోగమును గూర్చి వివరించుట**

118. అటుతపించెడి - తారనుగాంచి
పవనతనయుడు - ఇటులపలికెను
ఓసాధ్వీమణి - దుఃఖము మానుము
నామాటలువిని - ఓర్పు వహింపుము
గతజన్మముల - కర్మఫలములు
ఈ జన్మంబున - అనుభవించెదరు
ఈశరీరము - బుద్బుద ప్రాయము
జరామరణములు - జీవికి సహజము

119 దీనిని తెలిసిన - విజ్ఞులు మదిని
ఇసుమంతయును - శోకింపరుగా
నీదు ధర్మము - అంగదు గాచుట
వాని క్షేమమును - ఆలోచించుట
కిష్కింధకతని - రాజును జేయుము
తోడుగ ఉండి - రాజ్యమేలుము
తల్లివి తండ్రివి - గురువువు నీవై
వానికొరకు జీ - వించి యుండుమని
కర్మయోగమును - హనుమతెలిపెను
తారాసతిని - ఊరడించుటకు

**తారహనుమంతునకు బదులు పలుకుట**

120 హనుమచెప్పిన - కర్మయోగమును
శ్రద్ధగవినిన - తారయిటులనె
తండ్రిపిదప పిన - తండ్రిసుగ్రీవుడు
నీవునుడివిన - కార్యములన్నియు
నిర్వహించుట - కడు సమ్మతము
ఇహపరంబులా - నాపతిదేవుని
పాదపద్మములె - నాకుశరణ్యము
అనితారాసతి - పలికెహనుమతో

(21వ సర్గసంపూర్ణం)

## ౨౨వ సర్గ

**వాలి సుగ్రీవుని మన్నింపుమని కోరుట**

121 సతిపలుకులను - వినికపివరుడు
అతిభారముగా - కనులు తెరచెను
సోదరుడగు - సుగ్రీవుని గాంచి
తనపాపములు - మన్నించగ వేడి
ఓ! సుగ్రీవా - అరుగుచుంటిని
దివిజధామము - ఆనందముతో
చిట్టచివరిగా - నాదుకోర్కెను
మన్నించెదవని - నేతలచెదను

122 ప్రాణసమానుని - నా అంగదుని
సొంతసుతుని వలె - సాకుము నీవు
నిశితజ్ఞానము - కలిగినతార
నుడివిన పలుకులు - ఆలకింపుము
భానుకుమారా - నీకర్తవ్యము
రామకార్యము - సఫలముజేయుట
రామచంద్రుని - అభయముపొందిన
సకలజనులకు - కలుగు శుభములనె

123. అటుపిమ్మటతా - నంగదుగాంచి
తనయా అంగద - నీపినతండ్రి
సుగ్రీవుడెస - ర్వస్వమునీకు
అతని ఆజ్ఞను - జవదాటకుము
ప్రీతిమీరగా - ఆలకించుము
అతని స్నేహితులు - నీ స్నేహితులుగ
అతని శత్రులు - నీ శత్రులుగా
ఎంచితలంచుము - అన్ని వేళలా

124. నన్నుమెచ్చి నా - జనకుడు, ఒసగిన
హేమమాలికను - నీవు ధరింపుము
వానరరాజ్యము - స్వీకరింపుము
సుఖశాంతులతో - రాజ్యమేలుము
అనిపలికెడి తన - అన్న మాటవిని
ఆశ్రునయనాల - అన్నను జేరి
వాలిమెడనున్న - హేమమాలను
చేకొనితన కం - రమునదాల్చెను

(22వ సర్గ సంపూర్ణం)

## ౨౩వ సర్గ

***వాలి విగత జీవుడగుట***

125 వాలికనుగ్రుడ్లు - గిరగిర తిరిగెను
భీకరరదములు - బయటకువచ్చెను
తీవ్రశరముచే - పీడింపబడి
తనువునువీడి - చేరె సురపతిని
మృతపతి వదనము - జూచుచుతార
రోదించెనుకడు - దీనముగాబడి
వానరులందరి - ఆక్రందనలు
మిన్నుముట్టివి - షాదమునిండెను

126. కడుపునపుట్టిన - తనయులున్నను
ధనధాన్యములు - తృప్తిగనున్నను
పెనిమిటిలేని - మగువులనుగని
విధవయందురు - జగతిని జనులు
ఓ నావల్లభ - ఓ నాదైవమ
నన్ను అనాధను - గావించితివి
పరులపంచకు - అప్పజెప్పితివి
ఆనందముగా - నాకమరగితివి

127 అనితపించుచు - అంగదుజేరి
నీప్రియజనకుని - చిట్టచివరిగా
కన్నులు దీరగ - గాంచుమునీవు
పాదములకు నీ - మ్రొక్కులొసగుము
ఆయురారోగ్య - ఐశ్వర్యములతో
తులతూగెడుగతి - దీవెనలందుము
తల్లి పలుకులు - శిరమున దాలిచి
వాలి పదములకు - మ్రొక్కె అంగదుడు

(23వ సర్గ సంపూర్ణం)

## ౨4వ సర్గ

*సుగ్రీవుడు వాలికై శోకించుట*

28. ఇంద్రసుతునిగని - సూర్యనందనుడు
పరితపించుచూ - రాముని జేరి
చేసినబాసను - నిలుపుకొంటివి
కపిరాజ్యమును - నా కొసగితివి
ఈ జీవితమున - రాజ్యసుఖమ్ముల
ఆశ నశించెను - నను మన్నింపుము
నేనరిగెద ఆ - ఋష్యమూకగిరి
కైకొందుననే - సాధువర్తనము

129 అతిబలశాలి - ఇంద్రకుమారుడు
సోదరుండనని - మదినిదలంచి
రణమునందు నను - ద్రుంచక వదలెను
అట్టి మహాత్ముని - రాజ్యకాంక్షతో
కుటిలబుద్ధిగొని - చంపించితిని
అంత్యకాలమున - వాలిపలికిన
సాంత్వవచనముల - నేమారితిని
ఓరఘునందన - నీవు యొనర్పుము
అంగదునకుప - ట్టాభిషేకము
అనిరాము[illegible] - పలికె [illegible]
[illegible]

130 తననోదార్చగ - వచ్చురాముగని
తారరామునితో - ఇటులపలికెను
అప్రమేయుడవు - విజితేంద్రియుడవు
ఘనధార్మికుడవు - మహాబలుడవు
నాపతివాలిని - చంపిన శరముతో
నన్ను ద్రుంచుము - దయగొనినీవు
నాకమునందు - నాకై వేచెడి
నాపతి జేరగ - త్వరపడుచుంటిని

131. ఆర్యవరేణ్యా - నీవిటవనిలో
సీత లేక ఎటు - తపించుచుంటివో
అటులేనాపతి - స్వర్గమునందు
నాకొరకైకడు - వగచుచుండును
నన్ను చంపుటకు - వెనుకాడకుము
నిను తాకదుస్త్రీ - హత్యాదోషము
మాదంపతులను - విడదీయకుము
నాపతికడకు - రయమునబంపుము

132. దానములన్నిట - సతీదానము
కడుశ్రేష్ఠమని - బుధులు చెప్పుదురు
నాపతి సన్నిధి - నన్నుజేర్చుము
నీకుదక్కును - దానిఫలితము
వాలిని ద్రుంచిన - పాపము తొలగి
నీకులభించును - పుణ్యఫలములు
అనివగచెడి ఆ - తారనుగాంచి
రఘుకులేశుడు - ఈవిధిపలికెను

(24వ సర్గ సంపూర్ణం)

## ౨౫వ సర్గ

### రాముడు తారను శాంతపరచుట

133. సత్యలోకమున - బ్రహ్మకరముల
నిఖిల జగములు - నిర్మితమాయెను
నలువయొక్క - సంకల్పమాత్రమున
సకలకర్మములు - సాగుచుండును
ధరలో జీవులు - సుఖదుఃఖములను
కర్మఫలముచే - అనుభవించెదరు
తరుచరవీరుని - కర్మమువలన
అవనివీడెనని - తెలియుము తార

134 నా బాణమున - వాలిచంపబడి
స్వర్గము జేరెను - దోషరహితుడై
వీరపత్నివగు - నీ వీరీతిని
దుఃఖమునొందుట - తగనిపనియని
ప్రీతిమీరగా - నీ అంగదుని
కిష్కింధకుయువ - రాజును జేతును
అని రఘురాముడు - తారఅంగదుల
సాంత్వవచనముల - ఊరడించెను

**వాలి దహన క్రియలు**

135 భాస్కరసుతుని - తారాసతిని
వాయుకుమారుని - అంగదుగాంచి
వాలితనువునకు - దహనక్రియలు
గావింపుడని - రాముడుపలుక
దినకరసూనుడు - ఆజ్ఞను ఇడగ
కపులంతట ఒక - శిబికనుదెచ్చిరి
వాలితనువునకు - సుగ్రీవాదులు
పన్నీటితోస్నా - నముగావించిరి

136 మెండుగ మెడలో - మాలలువేసిరి
చీనాంబరములు - అలంకరించిరి
గంధసుమములు - తనువున జల్లిరి
వాలికాయమును - చితిపై జేర్చిరి
వహ్నిముఖంబున - సంస్కరించిరి
అదిగాంచిన ఆ - వాలిసతితార
కడురోదించుచు - నేలనుగూలెను
అటులదుఃఖిడు - వాలిసతినిగని
వానరాంగనలు - ఊరడించిరి
ప్రీతిగ కర్మలు - గావించినతరి
అంగదాదులు - స్నానము జేసి
రఘురాముని - దరి జేరినిలచిరి

(25వ సర్గ సంపూర్ణం)

## ౨౬వ సర్గ

***హనుమంతుడు సుగ్రీవునకు పట్టాభిషేకము జరిపించుమని రాముని కోరుట***

137 అటుపిమ్మట ఆ - పవనతనయుడు
కడువినయమ్ముగ - కరములు మోడ్చి
రఘురామునితో - ఇటుల పలికెను
ఓ రామానీ - అ భయము చేతను
సుగ్రీవుడు కపి - రాజ్యము పొందెను
మము కృతార్థులను - జేయగనీవు
కిష్కింధకుకడు - వేగమెరమ్మ
నీ కరములతో - జరుపగావలె
సుగ్రీవునిప - ట్టాభిషేకమని
అంజలి ఘటించి - పలికె ప్రీతితో

138 అనిపలికిన ఆ - హనుమనుగాంచి
నాదుజనకుని - ఆనతిమేరకు
పదునాల్గేండ్ల - వనవాసమున
పురసీమల నే - దాకగరాదు
కిష్కింధాపురి - జేరుమునీవు
సుగ్రీవుని కపి - రాజుగ జేయుము
తదుపరినీవు - ప్రభువు నాజ్ఞగొని
యువరాజునిగా - అంగదు జేయుము
అని రఘురాముడు - ధర్మనిరతితో
అంజన సుతునకు - ఆజ్ఞను యిడెను

139 అర్ఘ్యజగాంచి - రాముడిటులనె
వర్షఋతువునా - రెండుమాసములు
ఆ ఋతువునకు - ముందువెనుకగల
రెండుమాసములు - వానలుమెండు
ఆ సమయంబున - కపిసైనికులు
ఉద్యోగములు - చేయనొల్లరు
కావున మనకీ - నాల్గుమాసములు
రణము జేయగా - పనికిరానివి

140 తదుపరి వచ్చెడి - కార్తీకంబున
దశకంఠునిగని - తుదముట్టించెడి
యతనములన్నీ - ఆలోచింపుము
అంతదనుక నా - అనుజునిగూడి
నేవసియించెద - ప్రశ్రవణాద్రిని
అనెడిరాముని - పలుకులు వినిన
దిరకరసుతుడు - రామునాజ్ఞగొని
కిష్కింధాపురి - పయనమాయెను

**సుగ్రీవుని పట్టాభిషేకము**

141 వానరవీరులు - వెంటగొలువగా
కడుసుందరమగు - కిష్కింధాపురి
సుగ్రీవాదులు - అడుగిడినంతనె
నగరవాసులు - బంధుమిత్రులు
హర్షముతోపుల - కించిపోయిరి
శుభకరములగు - వస్తు తతులగొని
పదునారుగురు - కన్యలు ఎదురిడి
కడువినయముగా - ఆహ్వానించిరి

142 కిష్కింధాపురి - నలంకరించిరి
వస్తుతతులను - సిద్ధపరచిరి
ఆగమవిధిప - ట్టాభిషేకమును
సుగ్రీవునకు - జరిపించితిరి
అంగదునియువ - రాజుగ జేసిరి
బ్రాహ్మణోత్తముల - సన్మానించిరి
రుమనుబొంది - శాంతించిసుగ్రీవుడు
రఘురామునిద - ర్శించగ వెడలెను.

(26వ సర్గ సంపూర్ణం)

## 27వ సర్గ

### వర్షఋతు వర్ణనము

143 రామలక్ష్మణులు - తపనతనూజుని
హనుమదంగదుల - విడచినపిమ్మట
నీలమేఘముల - రాశినిబోలు
నానావిధఫల - వృక్షజాతులతో
పలుపలురకముల - పూదీవెలతో
సింహశార్దూల - మృగసమూహముల
గైరికాదిపలు - ధాతువులున్న
ప్రస్రవణాద్రిని - రయమున జేరిరి

144 ఎలకోయిలలు - పంచమస్వరమున
కడు మధురముగా - కూయుచుండెను
కిలకిలలాడుచు - పక్షులగుంపులు
గగనతలములో - సంచరించెను
కలువలునిండిన - కొలకులయందు
జలపక్షులు - అల రారుచుండెను
ఆ శోభలను - గాంచిరాముడు
సీతను దలచి - కడుచింతించెను

145 ప్రస్రవణగిరి - గుహయందుండిన
రామును పలికె - లక్ష్మణుని గని
ఈ గుహద్వారము - నైఋతిదిశగా
ఉండుటవలన - వర్షప్రభావము
మనల నధికముగ - బాధగూర్చదు
వాస్తురీతిగా - ఒప్పుచున్నది
కావున సుఖముగ - వసింపగలము
వర్షాకాలము - ఏగునందాక

(27వ సర్గసంపూర్ణం)

## ౨౮వ సర్గ

146 వర్షఋతువు ప్రా - రంభమాయెను
గగనమంతమే - ఘావృతమాయెను
వేడినేలపై - కురిసినచినుకులు
ఆవిరియ్యై పై - కెగసిలేచెను
గహనభూముల - మృగసమూహములు
వాటి నెలవులకు - చేరి దాగిడెను
బెకబెకలాడుచు - కప్పలగుంపులు
వానకు మురిసి - బయటకువచ్చెను

147 మత్తగజమ్ముల - ఘీంకారములతో
అళిసంఘంబుల - ఝుంకారములతో
క్రూరమృగమ్ముల - కరకు టరపులతో
నాట్యమయూరుల - పదతాడనతో
ఎలకోయిలల - పంచమస్వరముతో
చక్రవాకముల - సందోహముతో
అడవియంతయు - పులకిత మవగ
సీతనుదలచి - రాముడుక్రుంగెను

(28వ సర్గ సంపూర్ణం)

## ౨౯వ సర్గ

*శరదాగమంబున రాముడు దుఃఖించుట*

148. వర్షఋతువు అనం - తరమొచ్చెను
శరత్కాలము - బహుకాంతులతో
పశుపక్ష్యాదుల - పూల లతలతో
కడు అలరారెను - వసంతఋతువు
సీతనుబాసిన - రామునిమనము
మరుని సెగలతో - క్రుంగికృశించెను
భానుకుమారుడు - ఇచ్చిన బాసను
విస్మరించెనని - రాముడుదలచెను

*రాముడు సుగ్రీవుని నిందించుట*

149. కిష్కింధరాజ్యము - పొందిసుగ్రీవుడు
కడుముదంబున - భోగములంది
కడుకాముకుడై - తననే మరచి
తారరుమలతో - కామక్రీడల
పగలు రేయనక - కాలముగడపుచు
రాజ్యపాలనము - అంతయుమరచి
సుగ్రీవుడు స్త్రీ - లోలుడాయెను
రామునికిచ్చిన - బాసనుమరచి

**హనుమంతుడు సుగ్రీవునితో రామకార్యమున కుపక్రమింపగోరుట**

150. సుగ్రీవుని అ - మాత్యవర్యుడు
పలుధర్మంబులు - తెలిసినవాడు
మృదుమధురముగా - పలికెడివాడు
నవవ్యాకరణ - పండితోత్తముడు
బుద్ధిమంతుడు - కార్యశూరుడు
కర్తవ్యముబో - ధించగలాడు
హనుమంతుడు - సుగ్రీవునిజేరి
కడువినయముగా - నిటులపలికెను

151. కాలమునెరిగి - కార్యము జేయుట
కార్యశూరుల - ప్రధమలక్షణము
రాముని కృపచే - రాజ్యముపొంది
సురుచిరకీర్తిని - పొందినాడవు
రామునికిచ్చిన - మాటను మరచి
సురభోగముల - తేలియాడితివి
సత్యధర్మముల - పరిరక్షకుడగు
రామునిమనము - నొప్పించితివి

152. తమకార్యములను - పరిత్యజించియు
మిత్రుల కార్యము - జేయువారలు
ఈ ధరయందున - కడుఉత్తములని
నీ వెరుంగవా - కపికులతిలకా
రఘుకులేశుడు - రామచంద్రుడు
దేవాసురులజ - యించగలాడు
అట్టివానికి - రోషమువచ్చిన
అంతము జేయును - వానరకులము

153 క్షణమొక యుగముగ - కాలముగడపుచు
రాముడుండెను - ప్రశ్రవణాద్రిని
నీ స్నేహమునే - మరిమరితలచుచు
నీ రాకకొరకు - వేచియుండెను
ఇచ్చిన బాసను - నిలుపు కొనుటకై
ధరణీజాతను - వెదకించుటకై
నలుదిశలకును - కపులను బంపుము
రాము మనము - శాంతింపజేయుము

154\. పవనతనయుని - పలుకులనువిని
అదరిపడెను - సుగ్రీవుడంతట
తనసైన్యమునకు - అధిపతి అయిన
నీలునిపిలచి - ఇటు శాసించెను
అంగదుతోడుగ - వనచరులందర
రాముని పనికై - సిద్ధపరపుము
నేటి నుండిపదు - నైదు దినంబుల
వారు చేరవలె - కిష్కింధాపురి
అటులరాని ఆ - వనచరులకునే
మరణశిక్ష వి - ధియించెద ననెను

(29వ సర్గ సంపూర్ణం)

## ౩౦వ సర్గ

155 వనవాసమునకు - నేవలదన్నా
కోరివచ్చినది - నాతోకలసి
పర్ణశాలలో - ఉన్నసమయాన
హంసలరొదవిని - మేల్గాంచెడిది
ఎలకోయిలలను - అనుకరించుచూ
మధురముగా నను - పలుకరించెడిది
చక్రవాకముల - కలరవములు విని
అక్కునజేరి - మురిపించెడిది

156 అనిరాముడు విల - పించుచుండగా
ఫలములేరుకొని - లక్ష్మణుడొచ్చెను
దుఃఖితుడగుతన - అగ్రజుగాంచి
పొంగిపొరలెడి - శోకమాపుకొని
అనలము వంటిది - అవనీజాత
ఆమెనెవ్వరూ - తాకగలేరు
తాకినవారు - బ్రతుకజాలరు
అనిలక్ష్మణుడు - పలికె రామునితో

157. రామానీవు - నరనాధుడవు
మాతసీతకు - తగినభర్తవు
మరుశరములకు - క్రుంగిపోకుము
దృఢచిత్తుడవై - దీక్షబూనుము
దేవతలందర - స్తోత్రముజేయుము
సుగ్రీవాదుల - సాయముగొనుము
దుష్టరావణుని - తుదముట్టింపుము
అని సౌమిత్రి - పలికెరామునితో

158 అటులపలికెడి - లక్ష్మణునిగని
మధువుగ్రోలి - మత్తిల్లినవాడై
మన్మదక్రీడల - కాలముగడపుచు
రాజభోగముల - మునిగినవాడై
అగ్నిసాక్షిగా - చెలిమినిజేసిన
తనను మరచెనని - రాముడు పలికి
రయముననీవు - కిష్కింధకేగి
ఈ విధిపలుకుము - సుగ్రీవునితో

159. బాసకునిలచి - వాలినిజంపి
నిన్ను నిలిపితిని - కపిరాజ్యమున
నీవు ఒసగిన - మాటను మరచి
విస్మరించితివి - నాసతి జాడను
ఇకపైనీవు - జాప్యము జేసిన
బంధుజనులతో - అంతమొందెదవు
అని రఘురాముడు - పలికె సౌమిత్రితో
పటురోషమ్ము - మనమున పొంగగ.

160 ఉపకారమునకు - అపకారమును
జేసెడివాడు - పురుషాధముడు
చేసిన మేలును - మరచెడివారు
ఇచ్చినమాటను - తప్పెడివారు
కడుకృతఘ్నులు - ఈధరయందున
వారి శవములు - శునకము ముట్టదు
చేసినబాసను - నిలుపుకొమ్మని
సుగ్రీవునకు - తెలియజెప్పుము

(30వసర్గసంపూర్ణం)

## 31వ సర్గ

**లక్ష్మణుని జూచి వానరులు భయపడుట**

161. రాముని పలుకులు - విని లక్ష్మణుడు
రుద్రరూపమున - ఆది శేషుడై
ఈక్షణమేనే - ద్రుంతు సుగ్రీవుని
అంగదుడే ఆ - సాయమొసగును
ఆనతీయుమా - ఓరఘురామా
అనెడి లక్ష్మణుని - రామచంద్రుడు
శాంతపరచి - కిష్కింధకేగుమన
రాముని ఆనతి - శిరమున దాలిచి

162 ధనుర్బాణములు - కేలనిడుకొని
కిష్కింధాపురి - జేరి లక్ష్మణుడు
సింహద్వారము - చెంతను నిలచి
దిక్కులదర - సారించె నారిని
ప్రళయకాలమున - బడబాగ్నివలె
కనబడె కపులకు - లక్ష్మణుడాతరి
పరుగుపరుగునా - వారు వెడలిరి
తపనతనూజుని - మందిరమ్మునకు

163 లక్ష్మణు రాకను - వారు తెలిపిరి
భయకంపితులై - వణకసాగిరి
అంగదుడంతట - అటకేతెంచి
అంజలిఘటించి - ఎదురుగ నిలచెను
అంగదుగాంచి - లక్ష్మణు డిటులనె
రాముడు పంపగ - వచ్చినవాడను
రాముని పలుకులు - వినగోరినచో
రయమున రమ్మను - నీ పినతండ్రిని

(31వ సర్గ సంపూర్ణం)

## 32వ సర్గ

**లక్ష్మణుడు వచ్చుటవిని సుగ్రీవుడు భయపడుట**

164. సుమిత్రసుతుడు - పటురోషమ్మున
తనను జూడగా - వచ్చినాడని
అంగదుద్వారా - తెలిసినంతనే
అర్కజసుతుడు - భయకంపితుడై
తలపగలేదు - కీడురామునికి
ప్రాజ్ఞులువారు - నా ప్రియమిత్రులు
శత్రువులెవరో - చెడ్డనునాపై
చెప్పియుంటిరి - దశరథసుతులకు

**హనుమంతుడు సుగ్రీవునకు లక్ష్మణునిరాకకు కారణం బెరింగించుట**

165 ఆపలుకులువిని - ఆంజనేయుడు
లక్ష్మణురాకకు - కారణమరసి
కాలయాపనము - రాముని మనమున
పటురోషమ్మును - కలుగజేసెను
నీమత్తును వది - లించుట కొరకు
అనుజునీరీతి - పంపెరాముడు
అని పలురీతుల - హితములు పలుకగ
భయమువీడి - అంగదుని పంపెను

(32వ సర్గసంపూర్ణం)

## 33వ సర్గ

***లక్ష్మణుడు సుగ్రీవుని అంతఃపురములోనికేగుట***

166 నగరద్వారము - చేరిఅంగదుడు
ఒంటిగనిలచిన - సౌమిత్రినిగని
రాముని భ్రాతా - లోనికి రమ్మని
నా పినతండ్రి - మరిమరి వేడెను
అని వినయముగా - ఆహ్వానింపగ
లక్ష్మణుడంతట - లోని కడుగిడ
వానరులందరు - లేచినిలచిరి
వానరబుద్ధులు - అన్నీవిడచిరి

167 రాజమార్గమున - ఏగు లక్ష్మణుడు
వాలి తనయుని - అంగదు సదనము
శరభ, విద్యున్మాల - నిజగృహములను
సంపాతి, సూర్యాక్ష - సదనమ్ములను
వాయుతనూజుని - ఆలయమ్మును
వీరబాహు, సుబాహు - గృహమును
తార, సుసేల - దివ్య ధామములు
నలుని, నీలుని - మందిరంబులను
కుముద, సుసేతుల - నిలయంబులను
జాంబవంతుని - నిజగృహమ్మును
గాంచుచుఏగెను - లక్ష్మణుడంతట
సుగ్రీవుని సద - నమ్మును జేరగ

**సుగ్రీవుడులక్ష్మణుని శాంతపరచగా తారను బంపుట**

168 సూర్యకుమారుని - మందిరమ్మును
గాంచిలక్ష్మణుడు - భీకరనాదము
జేయగావిని - ఆ సుగ్రీవుడు
భయకంపితుడై - ఒడలు ఒణుకగా
ఇపుడు పోవుట - క్షేమముగాదని
ప్రియసతితారను - జేరిపలికెను
తరుణులందు - కోపమునుజూపరు
నీతికోవిదులు - పరిశుద్ధాత్ములు
కావున నీవు - త్వరితముగా జని
ఆ లక్ష్మణుని - ప్రసన్నుజేయుము

169 అటుపిమ్మట - నే లక్ష్మణుగాంచి
ఇచ్చిన మాటను - నిలుపుకొందును
అని సుగ్రీవుడు - పలుకగావిని
పానవశమున - సిగ్గునుబాసి
చెదరినకురులతో - నలిగినపూలతో
తడబడుచుండెడి - నడకలతోడ
రామునితమ్ముని - శాంతపరచగా
తారవెడలె - సౌమిత్రిని గనుటకు

**లక్ష్మణుడు తారతో సంభాషించుట**

170 తారనుగాంచి - లక్ష్మణుడిటులనె
రవిసుతుడిచ్చిన - నాల్గుమాసములు
గడువు ఎన్నడో - తీరిపోయెను
రామకార్యమును - మదిని దలంచక
పానచిత్తుడై - సుఖభోగముల
తేలియాడుచు - తనను మరచెను.
ఉపకారంబొన - రించువారిని
మరచినవాడు - మర్త్యుడేఇల

**తార లక్ష్మణుని సమాధాన పరచుట**

171 ఆ మాటలువిని - సౌమిత్రినిగని
తార ఈ విధిని - బదులుపలికెను
మే మెరుగుదుము - రామ శాసనము
మే మెరుగుదుము - రాము విక్రమము
మే మెరుగుదుము - కాల నిర్ణయము
భావి కార్యగతి - మే మెరుగుదుము
బలసంపదను - కలిగిన సుజనులు
బలహీనులపై - కోపమొందుదుర?

172 తపోనిష్ఠులు - మహామునీంద్రులు
మరు శరములకు - ఓడిన పిమ్మట
ముదితలగూడి - రాసకేళిలో
తేలియాడిరని - మీకు తెలియదా
స్థిరసంకల్పులు - నరులే ఆవిధి
మరుని వీడక - ముదితల గూడిన
వానరుండగు - వానరరాజు
రాసకేళిలో - మునిగుటతప్పా?

173 సూర్యసుతుడెం - తకాముకుడైనా
మరువలేదుమీ - కిచ్చిన బాసను
నాపతి ఆనతి - వచ్చినారిటకు
కామరూపులు - బల సంపన్నులు
కుధరవాసులు - కోటివానరులు
సీతాన్వేషణ - గావించుటకై
కావున నాపతి - సుగ్రీవునియెడ
లేశమైననూ - దోషములేదని
నీవునురాముడు - సమ్మతింతురని
నేమదినమ్మితి - సుమిత్రనందనా
సోదరభావము - మదినింపుకొని
సుగ్రీవునితో - మాటాడుటకు
లోనికిరండని - ఆహ్వానించగ
లక్ష్మణుడంత - శాంతమునొందెను
(33వ సర్గ సంపూర్ణం)

## 34, 35వ సర్గలు

**లక్ష్మణుడు సుగ్రీవునిగాంచుట నిందించుట**

174. అతిమెలకువతో - పలికెడి తారను
అనుసరించి జనె - అంతఃపురికి
వానరేశ్వరుడు - అతివినయముగా
లేచి నిలచెను - ముకుళిత కరుడై
శశితోనుండెడి - తారలవోలె
రుమా మొదలగు - అంబుజాక్షులు
సుమిత్రసుతుని - కడువినయముగా
హేమాసనమున - సన్మానించిరి

175 ఇడినబాసను - నిలుపుకొనుటకై
వాలినిజంపి - నిను కిష్కింధకు
రాజునుజేసి - రమణిని జేర్చితి
చేసిన బాసను - విస్మరించితివి
ఇకపై నీవు - జాప్యము జేసిన
బంధుజనులతో - అంతమొందెదవు
అని సీతాపతి - నీతో సూటిగ
తెలుపుమనెనని - లక్ష్మణుడనెను

176. పటుకోపమ్మున - పలుకులక్ష్మణుని
గాంచినతార - ఇటులపలికెను
వానరేంద్రుడు - క్రూరుడుకాడు
కుటిలుడుకాడు - కృతఘ్నుడుకాడు
అసత్యవాదిమరి - అసలేకాడు
రామునికొరకు - కీశరాజ్యమును
నన్నును రుమను - ధనసంపత్తులు
తృణప్రాయముగ - విడచునాతడు

177 రణరంగమున - రావణుద్రుంచి
రోహిణిజేరెడు - చంద్రునిరీతిగ
జనకజతోడ - రామునిజేర్చును
కిష్కింధాపతి - సుగ్రీవుండు
శంకవీడుము - మానుముకోపము
కోట్లకొలదిగా - వచ్చుకపులను
వెంటనిడుకొని - రామునిజూడగ
బయలువెడలుటకు - సిద్ధమాయెను

(34,35వ సర్గలు సమాప్తం)

## 36వ సర్గ

### సుగ్రీవుడు లక్ష్మణుని సమాధానపరచుట

178 అటుపిమ్మట - సుగ్రీవుడిటులనె
సప్తసాలముల - ఒకే బాణమున
దుంచివేసిన - భూరివిక్రముడు
మింటినాదిని - మీటినంతనే
కొండలు అడవులు - ధరణి ఒణకును
మందమతిని నే - తెలియకజేసిన
అపరాధములను - మన్నింపుమని
మరిమరి వేడెను - సౌమిత్రినిగని

179 ఓ కపినాయకా - రామునిబాధను
జూడగలేక - నిన్ను దూరితిని
శౌర్యపరాక్రమ - సాహసంబులా
నీవు సముడవు - రామచంద్రునకు
త్వరితగతిని కపి - సైన్యము గూర్చి
పయనము కమ్ము - ప్రస్రవణాద్రికి
దైవవశమునా - నీకురామునికి
నెయ్యముకుదిరెను - అనెలక్ష్మణుడు

(36వ సర్గ సంపూర్ణం)

## 37వ సర్గ

**సుగ్రీవుడు వానరులపిలువ నాజ్ఞనిడుట**

180. రాముని మాటను - మనమున నిలిపి
వర్షాకాలము - ఏగినంతనే
సేనాపతియగు - నీలునిబిలచి
కపులందరకి - ష్కింధకురమ్మని
పూర్వమేనేను - కబురంపితిని
వారిరాకకై - వేచియుంటినని
సూర్యసుతుడు - సుగ్రీవుడుచెప్పగ
సీతాపతి కడు - మోదమొందెను

181 అటుపిమ్మటతన - మంత్రిహనుమతో
కిష్కింధాపతి - ఇటులపలికెను
హిమశైలంబుల - వింధ్యాచలముల
మహేంద్ర మందర - కనకాచలముల
అంజనాచల - అరుణాచలముల
చిత్రకూటవి - చిత్ర శిఖరముల
మునిజనాశ్రమ - తాళవనముల
పద్మవనముల - పుష్పవాటికల

182 పూర్వపశ్చిమ - భూధరంబులా
జరియించెడి - మన వానరవీరుల
కిష్కింధకు వే - వేగరమ్మని
దూతలనిపుడే - నియోగించుము
పదిదినములలో - నాశాసనము
ఏవలిముఖుడు - ఆచరించడో
అట్టివారికి - శిరశ్ఛేదనము
రాజదండమని - తెలియజెప్పుము

183 సుగ్రీవాజ్ఞను - శిరమున దాలిచి
హనుమ దూతలను - రయమున రమ్మని
రాజశాసనము - వారికి తెలుపగ
దూతలంతగగ - నమ్మునకెగసి
వైనతేయుని - వే గమునుగొని
అన్ని దిక్కులకు - అన్ని వనములకు
అన్ని గిరులకు - పయనము జేసి
అందునందుగల - ప్లవగవీరులకు
రామకార్యము - రాజశాసనము
విన్నవించిరి - సంతసంబున

**వానరసేనలు కిష్కింధజేరుట**

184 రామకార్యము - అరసినంతనే
అంజనాద్రిగల - మూడుకోటులు
సప్తగిరినిగల - పదియుకోటులు
వింధ్యగిరినిగల - ఒక్కకోటియు
గిరిశాలయమున - వేలకోటులుగ
వీరవరులగు - ప్లవగవీరులు
అధికసంఖ్యలో - కానుకలనుగొని
వానరేశ్వరుని - జేరియొసంగిరి

(37వ సర్గ సంపూర్ణం)

## ౩౮వ సర్గ

***వానరసైన్యము సిద్ధమని సుగ్రీవుడు రామునితో పలుకుట***

185. తపనాత్మజుడు - సంతసించెను
కోటానుకోట్ల - కపియోధులగని
తాచేబూనిన - రామకార్యము
సఫలమగునని - మదినిదలచెను
వానరసైన్యము - వెంటనడువగా
అంగదజాంబ - వదాదివీరులు
ఆనందముతో - అనుసరించగా
వెడలినారు సు - గ్రీవలక్ష్మణులు

186 ప్రశ్రవణాద్రిని - జేరి సుగ్రీవుడు
భక్తిభావమున - ముకుళితకరుడై
దశరదసుతుని - రామునిజేరి
వానిపాదములు - శిరసునదాకెను
కాలయాపనకు - కినుక వలదనె
కినుకలేని రఘు - రామచంద్రుడు
సుగ్రీవునితన - అక్కున జేర్చి
పరమధర్మములు - విశదపరచెను

(౩౮వ సర్గసంపూర్ణం)

## 39వ సర్గ

**వానరసైన్యము వచ్చుట**

187. ఓయిమిత్రమా - భాస్కరతనయా
నీ సాయమ్మున - దండయాత్రను
జేయుపదకమును - ఆలోచింపుము
దుర్మదాంధుడగు - రావణాసురుని
సంహరింతు నే - రణమునందున
అని రఘువీరుడు - పలుకుచుండగా
గగనమార్గమున - ధూళిజనించెను
క్షణమునందు - చీకట్లుకమ్మెను

188 తార జనకుడగు - సుషేణుండును
రుమ పితరుడగు - ఆ తారుడును
మారుతిజనకుడు - కేసరినాముడు
దీర్ఘాయుష్కుడు - జాంబవంతుడు
నీలుడు, గవయుడు - గంధమాధనుడు
ధూమ్రాక్షుడును - దరీముఖుండు
నలుడు, రంభుడు - జయహనుమంతుడు
గజుడు, అంగదుడు- కుముదుడు, శరభుడు

189. దధిముఖుండు - మైందద్వివిదులు
ఇంద్రజానుడు - వహ్నిరంహుడు
మొదలగువారు - తమ సేనలతో
జానకీసతి - జాడ అరయుటకు
లంకేశ్వరుని - కడతేర్చుటకు
సీతామాతను - నిను జేర్చుటకు
రణోత్సాహమున - వచ్చి నిలచిరి
నీ ఆనతికై వేచి - యుంటిరని
రామునిగని - సుగ్రీవుడుపలుక
రామునిమనము - సంతసించెను

(39వసర్గ సంపూర్ణం)

## 40వ సర్గ

**సుగ్రీవుడు సీతాన్వేషణ జేయవలసినదిగా కపులను ఆదేశించుట**

190 దశరథనందన - భువినలుదెసల
వసియించెడి కపు - లందరువచ్చిరి
కామరూపులు - గగనగాములు
విక్రమవంతులు - కడుబలవంతులు
సాయజతుల్యులు - చతురమతులు
నీ ఆనతిని - శిరమునదాల్చగ
వేచియున్నారు - ముకుళితకరులై
అని సుగ్రీవుడు - పలికె రామునితో

191 ఆవిధి పలికిన - దినకరుసుతుని
కౌగిటజేర్చి - రాముడిటులనె
రావణాసురుని - పురమునందునా
నాసతిజానకి - నేటివరకును
బ్రతికియున్నదో - లేదోయనెడి
శంక మనమున - కలుగుచున్నది
కావున సీతను - గాంచినపిమ్మట
ఏవిధికార్యము - నిర్వహించుటో
నేవివరించెద - తపనతనూజ

**సుగ్రీవుడు వినతుని తూర్పు దిక్కుకు ఒంపుట**

192 రాముని పలుకులు - విని సుగ్రీవుడు
కపివీరులను - కలయజూచుచు
కొండలకోనల - నదీనదముల
మునివాటికల - గ్రామసీమల
పురములందున - సౌధములందున
ప్రతిఅంగుళము - కడు నిశితముగా
పరిశోధించుచు - పరిశీలించుచు
సీతాన్వేషణ - జరుపవలెనని

193 గిరిసమానుని - ఘననిభఘోషుని
శత్రుభయంకరు - మహాశూరుని
భాస్కరసోముల - వంశజాతుని
వానరసేనా - పతిని వినతుని
సీతాన్వేషణ - జరుపుటకొరకు
ఉదయాద్రిదనుక - నున్నవిషయములు
వివరముగ - విపులీకరించెను
ముప్పదిదినముల - తిరిగిరమ్మనె

40వ సర్గ సంపూర్ణం

## 41వ సర్గ

*సుగ్రీవుడు హనుమదాదులను దక్షిణదిశకు బంపుట*

194. దశకంఠుడు - పాలించెడిలంక
దక్షిణదిశలో - ఉండుటవలన
జాంబవదంగద - హనుమదాదులను
నీలుని, గవయుని - గజుని, గవాక్షుని
మైందుని, విజయుని- ద్వివిదుని, ఋషభుని
గంధమాదనుని - ఉల్కాముఖుని
సీతజాడగన - దక్షిణదిశకు
నిర్ణయించెను - వానరరాజు

*సుగ్రీవుడు వానరులకు దక్షిణదిశ నైసర్గికమును వివరించుట*

195. వానరవీరుల - జేరబిలచెను
దక్షిణదిశ నై - సర్గికమంతయు
కడువివరముగా - ఇటులజెప్పెను
పలురకములగు - లతాకుంజములు
పలుపలు విధమగు - వృక్షతతులతో
విశాలమగు విం - ధ్యాచలముండు
ఆనగమునకు - పశ్చిమంబున
మహాసర్పని - షేవితమైన
నర్మద వరద - భాగవతి మేఖల
నదీనదములు - పారు చుండును

196 అశ్వవంతియు - అవంతి యనెడి
పురములచట ప్ర - భవించు చుండును
వింధ్యపర్వతపు - దక్షిణంబున
గోదావరియు - కృష్ణవేణియును
జీవనదులు ప్ర - వహించు చుండును
ఋషిక, విదర్భ - వంగ కళింగ
చోళపాండ్యక - ళింగ ఆంధ్రలను
బహుదేశములను - గాంతురుమీరు

197 వింధ్యాచలపు - పూర్వభాగమున
వనములయందు - బహుదట్టమగు
దండకాటవిని - దాటినపిమ్మట
ఆంధ్రపుంఢ్రచోళ - పాండ్య కేరళ
దేశమ్ములను - గాంచిన పిమ్మట
పుష్పవనముల - చందనాటవుల
ఘనధాతువుల - మండితమైన
సహ్యాశైలమును - గాంతురుమీరు

198 అటుపిమ్మట - మలయాద్రినిజేరి
శిఖరాగ్రమున - ఎల్లసమయముల
వసియించెడి ముని - కుంభసంభవుని
కామితములు ఫలి-యింపగ మ్రొక్కుడు
ఆ మహనీయుని - ఆనతినిగొని
సురతాపసుల - సేవితమైనది
నిర్మలజలముల - అలరారునది
నదికావేరిని - గాంతురుమీరు

199 కొంతదూరమటు - ఏగినపిమ్మట
జలనిధిపతిసతి - తామ్రపర్ణిని
సాగరుకౌగిట - గాంతురుమీరు
హేమమయంబు - మణివిభూషితము
శ్రీవిలసితమగు - పాండ్యరాజుల
నగరద్వారము - అట కనుగొందురు
అటుపై ఇంకను - పయనముజేసిన
దక్షిణసంద్రపు - తీరముగందురు

200 వననిధిదాటెడు - మార్గముగనుడు
దానికిదాపుల - మహేంద్రగిరిపై
యక్షకిన్నెర - కింపురుషాదులు
గరుడగంధర్వ - సిద్ధచారణులు
ఎల్లవేళలా - సంచరించెదరు
అప్సరసలను - వెంటనిడుకొని
వజ్రాయుధుడు - పర్వసమయముల
వాసముజేయును - గిరిశిఖరమున

201 దక్షిణవననిధి - మధ్యభాగమున
మనుజులకెల్ల - అంతుపట్టని
శతయోజనముల - పరిమితినిగల
సుందరద్వీపము - అలరు చుండును
రాక్షసేశ్వరుడు - రావణాసురుడు
పరిపాలించెడి - పట్టణమందున
ఉండగలదని - నేతలచెదను
జాకరూకులై - కడునిశితముగా
అంగుళమ్మైన - వదలకమీరు
ద్వీపమంతయు - అన్వేషింపుడు

202 దక్షిణసంద్రపు - మధ్యభాగమున
సింహికయనెడి - నామముకలది
కడుక్రూరంబగు - రక్కసిగలదు
గగనభాగమున - ఏగువారల
ఛాయనుగ్రహించి - మింగుచుండును
ఆ రక్కసికి - జిక్కక మీరు
కడుమెలకువతో - దాటినపిమ్మట
లంకాద్వీపము - గాంతురచ్చట

203 సుందరమగు ఆ - లంకజేరుకొని
రావణుడాదిగ - అసురుల గృహముల
సీతామాతను - అన్వేషింపుడు
లంకాద్వీపము - దాటినపిమ్మట
శతయోజనముల - వననిధి నడుమ
సిద్ధచారణ - సేవితంబగు
ఋష్పితకనామం - బనెడి పర్వతము
గాంతురుమీరు - కడుఅబ్బురముగ

2 0 4 గగనమండలము - చుంబించుటకై
పై కెగసెడి ఆ - నగశిఖరమ్ముల
హేమశిఖరిపై - భానుడుండును
రజితశిఖరిపై - చంద్రుడుండును
చేసిన మేలును - మరచిన వారికి
నాస్తికులకును - కనబడదాగిరి
శిరములువంచి - అంజలిఘటించి
రామునిసతిని - అన్వేషింపుడు

2 0 5 అటుపిమ్మట పదు - నాల్గుఆమడలు
అరిగినంతనే - సూర్యవంతమను
గిరిరాజమును - గాంతురు మీరు
ఆగిరిదాటగ - వైద్యుతంబనెడి
భూధరమునుకను - గొందురు మీరు
అధరయందున - ఎల్లవేళలా
మనోహరములగు - ఫలపుష్పములు
కనులవిందుగా - అలరుచుండును

206 తనివితీరగా - ఫలములను తిని
మనసుమీరగా - మధువును గ్రోలి
కొంతతడవు ఆ - గిరిసానువుల
విశ్రమింపుడు - బడలిక తీరగ
ఆనగమును మీ - రతిక్రమించిన
కుంబరగిరిని - గాంతురుమీరు
విశ్వకర్మచే - నిర్మితమైనది
నానారత్నవి - భూషితంబులగు
సౌధంబులట - అలరు చుండును

207 కుంభసంభవుని - భవనముదాటి
కొంతదవ్వుమీ - రేగినపిమ్మట
కడుక్రూరంబగు - కోరలతోడ
ఘోరసర్పములు - ఎల్లవేళలా
పరిభ్రమించుచు - కాపుకాచెడి
వాసుకియనెడి - సర్పరాజుకు
నిలయంబైన - భోగవతియను
నామము కలిగిన - పట్టణ ముండును
ఆపురమందున - ప్రతిఅంగుళము
కడునిశితముగా - పరిశీలింపుడు
కామరూపులగు - మీరందరును
ఉరగరూపులై - ధరణిజవెదకుడు

208 అటుపిమ్మట మీ - రేగిన కనెదరు
వృషభాకృతిగల - వృషభ పర్వతము
చందనవనముల - శోభిల్లునది
రోహితనాములు - గంధర్వేంద్రులు
రక్షగనుందురు - అనవరతంబు
రవిచంద్రాగ్ని - శరీరముదాల్చిన
పుణ్యాత్ములకు - ఆలవాలమది
ఆనగమందరు - గాంచుచుపీగుడు
అంతియెగాని - అంటబోకుడు

209 ఆ వృషభాద్రిని - దాటినపిమ్మట
కడుదారుణమగు - పితృలోకము
వైవస్వతుని - రాజధానియు
కందురు మీరు - కడు అబ్బురముగ
దానిని జుట్టి - కడుభీకరముగ
కటిక చీకటులు - అలముకొని యుండు
మనుజకోటి - చేరరాని ప్రదేశము
అంతదనుకపో - వచ్చునుమీరు
అటుపిమ్మట - పోజాలరెవ్వరు

210 నే నుడివిన ఆ - తావులందునా
రామునిసతిని - అవధానంబున
గాంచవలయును - తత్పరమతులై
ముప్పదిదినముల - తిరిగిరావలె
చూచితిసీతని - ఎవరు చెప్పెదరో
ఆ కపివీరుడు - నాసమానుడై
సకలభోగముల - తేలగలవాడు
అని సుగ్రీవుడు - పలికె కపులతో

(41వ సర్గ సంపూర్ణం)

## 42వ సర్గ

**సుగ్రీవుడు సుషేణుని పశ్చిమదిశకు బంపుట**

211 తపనసంభవుని - మేనమామయగు
భీమవిక్రముని - ఇంద్రతేజుని
విమలయశుని - ఖగేంద్రతుల్యుని
తారతండ్రియగు - సుషేణునిగాంచి
భక్తిప్రపత్తుల - అంజలినొసగి
మహాబలులగు - మారీచులతో
రెండులక్షల - ప్లవగవీరులతో
పశ్చిమదిశకు - పోయిరమ్మనె

(42వ సర్గ సంపూర్ణం)

## 43వ సర్గ

### సుగ్రీవుడు శతవలిని ఉత్తరదిశకు పంపుట

212 శతవలియనెడు - వానరేశ్వరుని
తరుచరవీరుల - లక్షమందితో
యమ తనూజులగు - మంత్రివరులతో
ఉత్తరదిశకు - పయనము కమ్మనె
హిమనగముల గల - వనము లందున
జలాశయంబుల - నదీనదముల
పరిపరి విధముల - సీతాసాధ్విని
శోధించవలె - అనె సుగ్రీవుడు

(43వ సర్గ సంపూర్ణం)

## 44వ సర్గ

### రాముడు హస్తాంగుళీయకముహనుమంతునకిచ్చుట

213. వాయుసుతునిగని - భాస్కరసుతుడు
కడు మోదమ్మున - ఇటులపలికెను
ఆదశకంరుడు - సీతాసాధ్విని
ముజ్జగములలో - ఎందుదాచినా
బుద్ధి బలముతో - కార్యమునెరిగి
సాధించగల - శక్తిమంతుడవు
శ్రీరఘురాముని - సతి సీతనుగను
కార్యభారము - నీదే హనుమ

214. అవనీతనయను - ఈతడెగాంచును
అనిరఘురాముడు - మదిలోదలచి
తన నామముగల - అంగుళీయకము
పవనసుతునకు - ఒసగుచు ఇట్లనె
ఈనాముద్రిక - తోడ్కొనిపోయి
సీతకుదీనిని - గురుతుగనిమ్ము
శంక యొకింతయు - మనమున జెందక
సీతనమ్మునిను - రామదూతవని

115. రామచంద్రుని - ముద్రికగైకొని
అతులభక్తితో - కనుల కద్దుకొని
సద్భావముతో - శిరమున బెట్టి
రామపదములకు - అంజలినొసగి
రామచంద్రుని - దీవెనలంది
అంగదాదులు - అనుసరించగా
దక్షిణదిశకు - పయనమగుటకు
మరున్నందనుడు - మదినితలచెను

(44వ సర్గ సంపూర్ణం)

## 45వ సర్గ

### వానరులు నలుదిక్కులకు సీతాన్వేషణకై వెడలుట

216 ఓ కపులారా - నాయకులార
రాముని సతిని - మీరందరును
నేనుడివిన పలు - తావులందున
పరిపరి విధముల - పరిశీలింపుడు
నెలదినములలో - సీతాన్వేషణ
ముగియించుకొని - మరలిరావలె
అటులరాని ఏ - వానరుడైనా
మరణ దండనకు - గురికావలయును

217 కపిరాజగు సు - గ్రీవునానతిని
వానరులందరు - శిరమునదాల్చి
తూరుపుదిశకు - వినతుడేగెను
పశ్చిమమునకు - సుషేణుడరిగెను
ఉత్తరదిశకు - శతవలిఏగెను
దక్షిణంబునకు - పావనిఏగెను
అంబరమందున - అంజనసుతుడు
కనబడెతారల - నడుమ చంద్రుడై

218 రణోత్సాహము - పొంగిపొరలగా
సింహరవంబులు - జేయుచుకపులు
ఘనవాలమ్ముల - ధరణినిమోదె
ధరణి అదరిపడె - పదఘట్టనలచె
తమతమశక్తులు - విశద పరచుచు
ఒకరిమించివే - రొకరుసాగిరి
కపిరాజేంద్రుని - ఆనతిబడసి
నలుదిక్కులకు - ప్లవగవీరులు
సంతోషమ్మున - వెడలినారపుడు

(45వ సర్గ సంపూర్ణం)

## 46వ సర్గ

**రాముడు సుగ్రీవుని భూధరమంతయుగాంచుటకు కారణమడుగుట**

219. తరుచర వీరులు - నలు దిశలకును
సీతజాడగన - ఏగినంతనే
రఘురాముడు - సుగ్రీవునిగాంచి
భూధర మంతయు - ఎపుడు గాంచితివి
తిలకించుటకు - కారణ మేమన
వాలి దుందుభుల - కదనము నందున
వాలిదెబ్బలకు - ఓర్వజాలక
ధరణి యంతయు - దుందుభి పరువిడ
దుందుభి దురుముచు - వాలి పరువిడె
నాఅనుజునికి - సహాయ పడగ
వారి వెనుకగా - నే పరువిడగా
ఈధర యంతయు - గాంచితినపుడు

20 రాజ్యరమను చే - పట్టిననాపై
కినుక వహించి - వాలి తరుమగా
ధరణియందు తల - దాల్చు కొనుటకు
తావే లేదని - నే భయపడగా
బుద్ధిమంతుడు - పవనతనయుడు
నిశితముగా తా - యోచనజేసి
మాతంగముని - వాలికిడినట్టి
ఘోర శాపమును - గురుతుకు దెచ్చెను
ఋష్యమూకమున - వాలి కాలిడిన
వానిశిరంబు - వేయితునకలగు
కావున నేను - ఋష్యమూకమును
జేరి వసించితి - నాటినుండియు

(46వ సర్గ సంపూర్ణం)

## 47వ సర్గ

***వినతాదులు సీతజాడగనలేక మరలివచ్చుట***

221 తపనతనూజుని - ఆనతి మేరకు
వినతాదులంత - పూర్వ దిశనుగల
పలుదుర్గంబులు - నగరవాటికలు
నదులు సరస్సులు - నభములు పొదలు
మునివాటికలు - గ్రామసీమలు
పరిపరి విధముల - పరిశీలించుచు
వెదకిన తావులె - మరల వెదకుచు
జానకిజాడను - గాంచక కపులు
నిరాశజెంది - కడుదుఃఖితులై
తిరుగు ప్రయాణము - జేసిరంతట

## 48 49వ సర్గలు

**హనుమంతుడు వింధ్యపర్వతమున సీతకై వెదకుట**

223. దక్షిణదిశలో - మారుతాత్మజుడు
అంగదజాంబ - వదాది వీరులతో
కడు విశాలమగు - వింధ్యాచలమున
కాననసీమల - భూరివృక్షముల
ఘోరభయంకర - గిరిగుహాలందున
నదీనదముల - గిరిసానువుల
కడు సహనముతో - అన్నిదిశలలో
పరికించుచు వా - రరిగిరి ముందుకు

224 ఆకులులేక - ఫలపుష్పములతో
శోభిల్లెడిపలు - వృక్షజాతులను
ఎండు వారిన - తటాకంబులను
తీగలులేని - ఔషధి తతులను
మృగములు దున్నలు - పక్షులు లేని
పేరభూములను - మిట్టనేలలను
తుమ్మెదగుంపులు - మెండుగయున్న
కడుదుర్భరమగు - దేశముగాంచిరి

2 5 పూర్వకాలమున - తపోధనుండు
సత్యవాదియు - మహాభాగుడు
కండుడనెడిముని - వర్యుడొకండు
ఈ వనమందున - ఉండెడివాడు
పదునారేండ్ల - తన కుమారుడు
ఈ అడవులలో - తప్పి నశించెను
ఆ కారణమున - కడుకోపించి
ఘోర శాపమును - ఇచ్చుటచేత
ఈ గతిపట్టెను - ఈ వనమున కని
మారుతాత్మజుడు - కపులను గాంచి

2 2 6. ఆ విపినంబును - దాటినపిమ్మట
గుల్మావృతమగు - దారుణగుహలో
సురనిర్భయుడు - కడుభీకరుడగు
ఘనకాయుని ఒక - రక్కసు కనుగొని
వానరవరులు - జేరబోయిరి
అగ్నికణములు - కనుల రాల్చుచు
కపులను దునుమ - వచ్చు అసురుని
గాంచినంతనే - దశముఖు డనుకొనె

227. అంగదుడంత - ఆ రక్కసుని
అదనుబట్టి అర - చేతచరచగ
నెత్తురు గ్రక్కుచు - మహోనగము వలె
దనుజుడు కూలెను - ధరిత్రిపైనా
జానకి జాడను - ఎందును గానక
కపివరు లందరు - అలసిపోయిరి
ఆకలిదప్పుల - అలమటించిరి
అలసిసొలసిన - కపులను గాంచి
అంగదుడీవిధి - పలికెనప్పుడు

***అంగదుడు వానరులను పురికొల్పుట***

228 నా పినతండ్రి - వానరేశ్వరుని
ఆనతి మీరిన - మరణము తప్పదు
రఘుకులేశుని - సతినిగాంచుటకు
మనమందరము - ప్రతిన బూనవలె
దృఢసంకల్పము - కలిగియున్నచో
పట్టిన కార్యము - సఫలీ కృతమగు
జానకిజాడను - అరసిన పిమ్మట
పయనమగుదము - కిష్కింధకనె.
(48, 49వ సర్గలు సంపూర్ణం)

## 50వ సర్గ

**వానరులు ఋక్ష బిలమును గాంచుట**

229\. అంగదుడటుల - వానరవీరుల
ఆ రీతినిపురి - కొల్పినంతట
అటునిటు వెదకుచు - గాంచిరివారు
ఋక్షబిలమును - కడు అబ్బురముగ
తరువులు లతలు - పెరుగుటచేత
బిల మార్గమము - దుర్గమమాయె
సారస, హంస - చక్రవాకముల
పక్షుల గుంపులు - కిచకిచ లాడెను

230\. నీటతడసి బరు - వెక్కిన రెక్కల
పలుపలు రకముల - పుప్పొడి పడుటచె
పలురంగులవిల - సిల్లెడిరెక్కల
విదలించుకొని - రివ్వున ఎగురుచు
బిలమునుండి పై - కెగసివచ్చెడి
విహంగ తతులను - గాంచినంతనే
హనుమదాదులు - ఆదృశ్యము గని
తలచిరి బిలమున - జలముండు నని

**ఋక్ష బిలవర్ణనము**

231 ఒకరికరము వే - రొకరు బట్టుకొని
అంధకారమగు - ఆ బిలమందున
వానరవీరులు - అడుగిడినంతనె
వ్యాఘ్ర సింహములు - బిలమును వదలి
పరువిడసాగెను - తోచిన త్రోవల
దప్పికచే నో - రెండుట చేతను
బిలమార్గమున - యోజనదూరము
పయనము జేయగ - గాంచిరివారు
దివ్యభూమిని - కడు అబ్బురముగ

232 సాల, తమాల - తక్కోల హింతాళ
నారికేళ పున్నా - గ కరవీర
చంపక, చంద్రి - నాగ కేసర
రసాల తాళ - వకుల కర్ణికార
నింబ కదంబ - ఖర్జూర కకుభాది
నానావిధ ఫల - పుష్పజాతులు
కనుకలకు ఎంతో - విందుజేయగా
వనమలరాడెను - రమణీయముగా

233 నీలవైడూర్య - మణి వేదికలు
భానునివలె కడు - కాంతులు జిమ్మగ
నిర్మల జలములు - నిండిన కొలనుల
పసిడిమత్స్యములు- పసిడి కూర్మములు
మనసు మీరగా - ఈదు లాడగ
బంగరు రెక్కల - జలవిహంగములు
మునకలు వేయుచు- రవములు జేయగ
వనముల రాడెను - రమణీయముగా

234 కనకమయంబగు - గోడలపైనా
వజ్రవైడూర్య - మంచి ముత్యములు
ఇంపుగపొదగిన - విమాన గృహముల
మణిమయకాంచన - గవాక్షమ్ములు
స్వర్ణశయనములు - రత్నాసనములు
రత్నకంబళులు - పీతాంబరములు
చందనాగరు - సుగంధ ద్రవ్యముల
వనములరాడెను - రమణీయముగా

235. వాటి మధ్యమున - గాంచిరి కపులు
కృష్ణాజినములు - వల్కాలు దాల్చిన
దివ్యకాంతుల - తేజరిల్లుచు
తపముజేయు ఒక - వృద్ధ తాపసిని
కపికుంజరులు - ముకుళిత కరులై
భక్తిమీరగా - నిలచిదాపున
కాంచననిర్మిత - పుర విశేషము
ఆమె నడిగెను - సమీరసుతుడు

(50వ సర్గ సంపూర్ణం)

## 51వ సర్గ

### స్వయంప్రభ ఋక్ష బిల వృత్తాంతము తెలుపుట

236 దానవశ్రేష్ఠుడు - మయుడనువాడు
పటుతర తపమున - నలువమెప్పించి
దానవ గురువగు - శుక్రాచార్యుని
శిల్ప శాస్త్రమును - వరముగ పొంది
దనుజ కులమునకు - విశ్వకర్మగా
కీర్తి గడించెను - మహిమాన్వితునిగ
హేమ యనెడి - ఒక అచ్చర గూడి
స్వర్గ సుఖములు - అనుభవించెను

237 కాంచన మణిమయ - సుందర వనములు
బంగరుపొన్నులు - రత్నవేదికలు
మణిమందిరములు - దివ్యభవనములు
నిర్మలమైన - జలాశయములు
ఇవి అన్నియు ఆ - మయు నిర్మితములని
హేమయనెడి - ఒక అచ్చరగూడి
మాయాబలసం - పన్నుడుమయుడు
సకలభోగముల - అనుభవించుచు
కామ క్రీడల - ఓలలాడుచు
కొంతకాలమిట - వాసరముండెను

238. హేమామయుల - ప్రణయమును గని
వజ్రధారిఖండిం - చెను మయుని
అంతటనలువ - మయుని సంపదలు
హేమకొసగెను - అనుభవింపుమని
నా ప్రియసఖి యగు - హేమ కోర్కెపై
గాచుచుంటినీ - కాంచన వనమును
హేమకు నేను - కడుప్రియసఖిని
నన్ను పిలుతురు - స్వయంప్రభయని

239 మీరలెవ్వరీ - దుర్గ చయముల
కాంతారముల - తిరుగు చుంటిరి
ఎటుగాంచితిరీ - ఋక్షబిలమును
మార్గమెటుల అ - న్వేషణజేసిరి
కడుప్రయాసతో - అరుగుదెంచిరి
మధురఫలములు - అమృతరసములు
కడుపుమీరగా - ఆరగింపుడీ
బడలిక తీరిన - తదుపరి క్షణమున
మీ కదయంతయు - నాకు దెలుపుడని
హనుమంతుని గని - తాపసిపలికె

(51వ సర్గ సంపూర్ణం)

## 52వ సర్గ

**హనుమంతుడు స్వయంప్రభకు తమ వృత్తాంత మంతయు తెలుపుట**

240. దశరథేశ్వరుని - పెద్దకుమారుడు
శ్రీరఘురాముడు - సత్యధర్ముడు
జనకుని యానతి - శిరమున దాలిచి
వనవాసమునకు - ఏగు సమయాన
మగువ సీతయు - భ్రాత లక్ష్మణుడు
వెన్నంటిరాగ - వనముల దిరుగుచు
జనస్థానమున - పంచవటిదరి
పర్ణశాలను - నిర్మించుకొని
సుఖముగ కాలము - కడుపుచుండెడి.
సమయమందున - ఇటులజరిగెను.

241 రామలక్ష్మణులు - లేనిసమయాన
ఒంటిగ నున్న - సీతాసాధ్విని
దానవేశ్వరుడు - రావణాసురుడు
అపహరించిజనె - వ్యోమమార్గమున
రామలక్ష్మణులు - సీతను వెదకుచు
ఋష్యమూకమున - మము కలిసితిరి
వానరరాజగు - సుగ్రీవునితో
అగ్నిసాక్షిగా - చెలిమినిజేసెరి.

242 రామచంద్రుని - కోరిక మీరకు
సీతాన్వేషణ - జేయుట కొరకు
కపిరాజగు - సుగ్రీవుడంపెను
వానరవీరుల - నలు దిశలకును
దక్షిణదిశగా - వచ్చిన మేము
ప్రతి అంగుళము - వెదకి నారము
వెదకివెదకి మే - మలసిపోతిమి
ఆకలిదప్పుల - అలమటించితిమి

243. దిక్కుతోచక - చతికిల బడగ
అతి దుర్గమమగు - ఋక్షబిలమును
గాంచిరీకపులు - కడు అచ్చెరముగ
బిలమునుండి పై - కెగసి వచ్చెడి
పక్షుల ఱెక్కలు - తడయుట చేత
బిలమునందు కడు - జలముండునని
సాహసించి ~~ఈ~~ - గుహను జొచ్చితిమి
నిన్నుగాంచి కడు - సంతసించితిమి

244 నీవొసంగిన - మధుర ఫలములు
కడుపుమీరగా - ఆరగించితిమి
మా తనువులు - కాపాడుకొంటిమి
వానరరాజు - ఇచ్చిన గడువు
ముప్పది దినములు - దాటిపోయెను
నీదీవెనలను - ఒసగుము మాకు
మాకు జేసితివి - మహోపకారము
ప్రత్యుపకారము - ఏమిచేతుము

(52వ సర్గ సంపూర్ణం)

## 53వ సర్గ

### స్వయం ప్రభ వానరులను గుహ నుండి బయటకు పంపుట

245. ఆవిధిపలికిన - హనుమను గాంచి
బహుజన్మంబుల - నోముఫలముగా
పుణ్యపురుషులగు - మిము గాంచితిని
మిముపూజించి - కృతార్థనైతిని
మానవధర్మము - నేజేసితిని
ప్రత్యుపకారము - ఏలనాకిక
రామునిసతిని - కనుగొనగలరు
రామకార్యము - సాధించెదరు

246 అటులపలికిన - స్వయంప్రభనుగని
పవనతనయుడు - ఇటులపలికెను
కాలయాపనము - అయినదిగావున
బిలమునుండిప - సత్వరముగజనుటకు
మార్గమెయ్యదని - తాపసినడుగగ
తనువులతోడ - ఋక్షబిలమున
జొచ్చిన వారు - తనువులతోడ
దాటుట ఎంతో - దుర్లభమనెను.

247. తపోమహిమచే - మీఅందరిని
ఒక్క క్షణంబున - బయటకు బంపెద
కావున మీరు - కనులు మూయుడన
వానరులందరు - కనులు మూయగా
వృద్ధతాపసి - తపోమహిమచే
తరుచరవీరులు - బయటకు వచ్చిరి
జయముకలుగు మీ - కనిదీవించి
నిజగృహంబునకు - అరిగె స్వయంప్రభ

***అంగదుడు గడువు మీరినందున దుఃఖించుట***

248 కపులందరునూ - కనులు తెరువగా
ఎదురుగ నున్న - సాగరమునుగని
విస్మయమున - వీక్షించిరంతట
వానరవీరులు - ఒకపరికూర్చొని
వానరరాజు - సుగ్రీవుడొసగిన
గడువుదాటెనని - కడుదుఃఖించి
అంగదజాంబ - వదాదివీరులు
పరిపరి విధముల - యోచనజేసిరి

249. పవలురేయనక - ప్రశ్రవణాద్రిని
మదినిదలచెడి - రామచంద్రుని
ప్రియసతిసీతను - గానకఅరిగిన
రఘువీరునిసం - తుష్టు జేయుటకు
కిష్కింధాపతి - సుగ్రీవుండు
కపులందరకు - మరణదండన
విధియించుట - కడుతథ్యమ్ము
అచటకేగిమర - ణించుటకంటె
ఇచటే ఉండి - మరణించుదమని
అంగదాదులు - భీతిని జెంది
పలుపలువిధముల - యోచన జేసిరి

(53వ సర్గ సంపూర్ణం)

## 54,55,56వ సర్గలు

### అంగదుడు సుగ్రీవుని నిందించుట

250 కపిరాజగు - సుగ్రీవుశాసనము
మదిలోమెదలి - భయకంపితుడగు
అంగదుగాంచి - హనుమ ఇటులనె
సత్యసంధుడు - ధర్మకాముడు
ధృడ సంకల్పము - కలిగినవాడు
మంచి మిత్రుడు - పితృ సమానుడు
ప్రీతికాముడు - తారాసతిపై
తనయుడవైన - నినుహింసించడు
కిష్కింధకు యువ - రాజు వగుటచే
రాజశాసనము వ - ర్తించదునీకు
కావునశీఘ్రమె - ఏగు కిష్కింధకు
జననీజనకుల - ప్రేమ పొందుము.

2 5 1 అటులపలికెడి - మారుతినిగని
ధర్మముదలపక - జననితోసరియగు
అన్నసతిని కా - మించి వరించెను
జ్యేష్ఠ భ్రాతయని - మదినిదలంచక
రామవిభునిచే - జనకుని ద్రుంచి
తనకు మేలిడిన - రామునికార్యము
క్షణమున మరచి - సుఖముల తేలెను
చపలచిత్తుడు - బుద్ధిహీనుడు
అతనికెక్కడివి - లన్ని సుగుణములు
అని అంగదుడు - తపన తనూజుని
పలు రీతుల - నిష్ఠురములాడెను

2 5 2 అటులపలికిన - ఆ అంగదుడు
కన్నులనీరు - చిమ్ముచుండగా
దర్భలపైనా - తనువునువాల్చి
ప్రాణ త్యాగము - చేయగ నెంచెను
ప్రాణసములగు - మిత్రులగాంచి
హరివరులార - ఇండ్లకుఏగుడు
రామచంద్రునకు - సుగ్రీవునకు
రుమాదేవికి - జననితారకు
కడసారిగనా - అంజలులొసగుడు
అని అంగదుడు - పలికినంతనే

**సంపాతి వానర వీరులను గాంచుట**

253 వనచరు లంతట - ఆ అంగదుని
చేరి ప్రాణములు - వదలదలచిరి
కైకకిచ్చిన - రెండువరములు
శ్రీరఘురాముని - కాననవాసము
అయోధ్యాధిపతి - దశరదుమరణము
జనస్థానమున - దానవుల వధ
పంచవటిదరి - పర్ణశాలలో
దశకంఠునిచే - భూమిజ హరణము

254 రావణుచేతిలో - జటాయుమరణము
రామ సుగ్రీవుల - అపారమైత్రియు
రామశరమున - వాలి మరణము
కిష్కింధాపతి - కఠిన శాసనము
మరిమరితలచుచు - దుఃఖితులయిన
కపులరోదనలు - చెవినిసోకగా
దరిలోనున్న - గిరిగుహనుండి
సంపాతియను - పక్షినాధుడు
బయటకువచ్చి - అంగదుగాంచి
దుఃఖించుటకు - కారణమడిగెను.

(54,55,56 సర్గలుసంపూర్ణం)

## 57 మరియు 58 వ సరలు

### సంపాతి వానరులతో తన వృత్తాంతము తెలుపుట

2 5 5. ఘనగుణశాలి - మహాబలుండు
భీమకాయుడు - ప్రాణసమానుడు
ఆ జటాయువు - నా సోదరుడు
నే నగ్రజుడ సం - పాతియందురు
దగ్ధ పత్రుడను - ఎగురగలేను
దండకమందున - దనుజునితోడ
ఆజిని ఆపద - ఎటుల కలిగెను
వినగోరెద నీ - వెవడవు వానర

2 5 6 అటులడిగిన - సంపాతిని గాంచి
రాముని చరితము - కడు విశదముగా
అంగదు డంతట - తెలియ బరచగా
దుఃఖితులగు ఆ - వానర తతికి
మోదము గూర్ప - సంపాతి తనకద
కడు వివరముగా - ఇటుల తెలిపెను
ఒక దినమందున - అనుజు లిరువురము
పందె మూనితిమి - భానుని జేరగ

257 భానుని దాకగ - ఏగుచుండగా
భూధరమునగల - చిన్న నగములు
సూక్ష్మశిలలుగా - కనపడసాగెను
కులగిరులన్నియు - కరిచయములుగా
ఘోరాటవులు - పచ్చిక బీళ్లగ
నదీనదములు - నూలు పోగులుగ
సాగరమంతయు - చిరుసరస్సుగా
అలరారెను మా - కనులముందర

258 మే మిరువురము - ఇనమార్గమున
వాయువేగమున - ఏగుచుండగా
అంబరమధ్య - గతుండగు భానుని
చండకిరణములు - సోకి జటాయువు
సొలసి నంతనే - నా పక్షములు
సోదరుపైనా - కప్పినంతనే
నా పక్షములు - దగ్ధమాయెను
వింధ్యగిరిపైన - కూలితినేను

259 అని పలికిన సం - పాతిని కనుగొని
నే నుడివిన రఘు - రాము చరితము
అంతయు శ్రద్ధగ - వింటివిగాన
ధీవర్జితుడగు - రావణువాసము
ఎరిగితి వేని - విన్నవింపుమని
కడు ఉత్సుకతో - అంగదుడడుగ
ముసలితనమునా - మీద బడుటచే
మాటసాయము - నేచేసెదనని

**సంపాతి సీత వృత్తాంతము తెలుపుట**

260 ఒక దినంబున - మింటి మార్గమున
ఓ! రామా! ఓ! - లక్ష్మణాయనుచు
నయనమ్ములబా - ష్పములురాల్చుచు
గద్గద స్వరమున - పిలచు అతివను
రావణాసురుడు - దక్షిణదిశగా
గొనిపోవుట కను - లారగాంచితి
కావున మీరు - వననిధిదాటి
లంకజేరుకొని - సీతనుగాంచుడు

61 శతయోజనములు - దాటిన పిమ్మట
జలనిధియందున - ద్వీపముగలదు
విశ్వకర్మచే - నిర్మితమయిన
లంకానగరము - కడుసుందరము
రావణాసురుని - అంతఃపురమును
కాపుకాయును - రక్కసి మూకలు
కడు మెలుకవతో - లంకనుజేరి
ఫలసిద్ధిని గొని - రండుకపులారా

(57 మరియు 58 సర్గలుసంపూర్ణం)

## 59వ సర్గ

262 అటు పిమ్మట - సంపాతి చెప్పెను
సుపార్శ్వుండను - తన కుమారుడు
నిత్యము తనకా - హారము తెచ్చుట
ఒక దినంబున - గగనమార్గమున
రావణాసురుడు - అడిగిన పిమ్మట
లంకానగరికి - దారి చూపుట
తనను జేరిమ - హర్షులు, సిద్ధులు
పలు రీతులుగా - స్వస్తి పలుకుట

263. నా సుతుడంతట - కారణమడుగగ
రాక్షసరాజు - రావణాసురుడు
రాముని సతిని - బలిమిని గైకొని
ఏగుచుండగా - అనిమిషులైనా
నిలువగలేరు - దారి కడ్డముగ
అట్టివానికి - ఎదురుగ నిలిచి
దారిచూపిన - ఘనుడవు నీవని
స్వస్తి వచనములు - పలికిరి సిద్ధులు

264 ఆకలిగొనినే - నెదురు చూడగా
ఆహారము చే - కూర్చ నైతినని
కడుదుఃఖముతో - తనయుడు చెప్ప
నాటినుండినే - కోపమూనితిని
దశకంఠుని దును - మాడనెంచితి
సీతను రాముని - జేర్చగ నెంచితి
ఱెక్కలు లేని - కారణంబున
నా కోర్కెనునెర - వేర్చగనైతిని

(59వ సర్గ సంపూర్ణం)

## ౬౦వ సర్గ నుండి ౬౩వ సర్గ వరకు

### సంపాతి నిశాకరముని వృత్తాంతము చెప్పుట

265 భానుని వేడికి - ఱెక్కలు కాలి
వింధ్యను బడుట - విన్న వించితిని
మూడు రాత్రులు - గడిచిన పిమ్మట
మూర్ఛదేరినలు - దిక్కులగాంచి
దక్షిణవననిధి - తీరంబున గల
వింధ్యాచలముగ - ఎరిగితినేను
నిశాకరుండను - మునిపుంగవుని
ఆశ్రమమొకటి - అటయుండెడిది

266 భ్రాత జటాయువు - నేనును నిత్యము
నిశాకరుని సేవిం - చెడి వారము
పెద్దకాలము - మహోతపంబు
జేసిన పిమ్మట - నాకము జేరెను
అటులబడిన నే - కడుప్రయాసతో
ఆశ్రమంబును - జేరుకొంటిని
ఆ మహనీయుని - రాకకోసము
నిరీక్షించితి - తరుచ్ఛాయల

267 కొంత దవ్వునే - నటకూర్చుండగ
మహనీయుడగు - నిశాకరుండు
నను గురుతిడక - ఎవ్వడవీవనె
మరుక్షణములో - నన్నుగురుతిడి
సంపాతీనీ - పక్షము లేవి?
శరీరమీవిధి - ఏల కమిలెను?
ఈ రూపమునీ - కెటుల వచ్చెను
వివరముగా విశ - దీకరించుమనె

268. నేను జటాయువు - దర్పముతోడ
ముని పుంగవుల - సమక్షమందున
సూర్యుని ముట్టి - వచ్చుట కొరకు
ప్రతిన బూని ఆ - శంభు గిరినుండి
ఏక కాలమున - మింటి కేగుటయు
అటుపిమ్మట ఆ - భాను కిరణములు
సోకగ తమ్ముడు - సొమ్మసిల్లుటయు
జటాయువుజన - స్థానమునబడుట

269. ఱెక్కలుకాలి నే - వింధ్యను బడుటయు
అనుజుడు రాజ్యము - నా పరాక్రమము
అన్నియుపోయి - జీవచ్ఛవముగ
నే నిటులుంటి - మహర్షిపుంగవ
అని విలపించెడి - నన్ను గాంచుచు
తపోబలముచే - భవిష్యమునుగని
నీ పక్షములు - జవ సత్త్వములు
తొలి పరాక్రమము - లన్నీ వచ్చును

270. దశరథుడను ఇ - క్ష్వాకు వంశజుని
ప్రధమకుమారుడు - రామచంద్రుడు
పితృ వాక్యమును - శిరమున దాలిచి
అనుజ లక్ష్మణుడు - సీతాసతియు
అనుసరించ వన - వాస మేగగా
జనస్థానమున - రాముని సతిని
దానవరాజగు - రావణాసురుడు
అపహరించి - జను లంకానగరికి

271. సీతను వెదకుచు - రాముని దూతలు
కడు ప్రయాసతో - వచ్చెదరిటకు
భూమిజ గూర్చి - వానరతతితో
ముచ్చటించిన - ఎప్పటివలె
నీ పక్షములు - జవసత్త్వములు
ఇంపుగ వచ్చును - కావున నీవు
మరణేచ్ఛను విడి - ఇటనేయుండుము
అనిదీవించి ము - నీశ్వరుడరిగె

***సంపాతికి ఱెక్కలు మొలచుట***

272. మహిత కీర్తులగు - రామలక్ష్మణుల
కనుల గాంచకొం - డంత ఆశతో
ఎనిమిది వేల - వత్సరంబులై
గిరిగుహయందు - వేచి యుంటిని
ప్లవగులార నే - మిమ్ముగాంచితిని
నా జన్మంబు - ధన్యతగాంచెను
అనుచు సంపాతి - పలుకు చుండగా
పక్షము లొచ్చెను - కడు అబ్బురముగ

273 సూర్యరశ్మిచే - కమిలిన రెక్కలు
భూరితేజము - జవసంపదలు
మునిపుంగవుడ - గుణనిశాకరుని
దీవెన వలన - శోభిలెనేడు
జనకజ ఉనికిని - తెలియ జేసితిని
వననిధి దాటి - కార్యసిద్ధిని
పొందుడు మీరు - తరుచరులార
అనుచు సంపాతి - మింటి కెగిసెను.

(60 నుంచి 63వ సర్గలు సంపూర్ణం)

276. ధరను వివేకులు - శోకము నొందిన
పట్టిన కార్యము - విఘ్నంబగును
కావున మీరు - శోకము వదలి
ఉత్సాహంబును - నింపుడు మదిలో
అనెడి అంగదుని - మాటలు వినిన
కపులందరు ఉ - త్సాహవంతులై
రాత్రియంతయు - అంగదుజేరి
పలు పలు విధముల - యోచన జేసిరి

*అంగదుడు వానరుల కుత్సాహంబు కలుగజేయుట*

277. మరుచటి దినమున - వాలి తనయుడు
తరుచరులార - కడు బలవంతులు
వేగవంతులు - వీరులు, శూరులు
మహాయోధులు - శత్రు భీకరులు
మీరందరు మీ - బలాబలములను
మదిని తలపోసి - ఈ సంద్రమును
ఒక్కొక్కరు ఎం - తెంత దూరము
లంఘించెదరో - తెలియజేయుడనె

(64 వ సర్గ సంపూర్ణం)

## ౬౫వ సర్గ

***వానరవీరులు తమ శక్తుల నంగదునకు దెల్పుట***

278 గజుడుపది గ - వాక్షుడు ఇరువది
గవయుడు ముప్పది - నలుబది శరభుడు
గంధమాదనుడు - పలికె ఏబదని
మైందుడు అరువది-ద్వివిదుడు డెబ్బది
మామ సుషేణుడు - ఎనుబది పదులు
జాంబవంతుడు - నుడివె తొంబది
యోజనములు - లంఘించ గలమని
తెలిపె వానరులు - అంగదునిగని

279. శతయోజనములు - దాటగలాడను
క్రమ్మరతిరిగి - నే వచ్చుటకు
శక్తి యున్నదో - లేదో తెలియదు
నేదాటగ లేని - ఈజల నిధిని
మనలో ఎవ్వరు - దాటగలారు
ప్రాయోపవేశమె - ఇకశరణ్యమని
చింతించెడి ఆ - అంగదుగాంచి
జాంబవంతుడు - ఈ విధిపలికె

280 వాలితనయ - యువరాజువునీవు
కిష్కింధనుపా - లించగ లాడవు
మముకాపాడెడి - స్వామివి నీవు
మమునడపించెడి - నాయకుండవు
వేయి కాదుపది - వేల ఆమడలు
క్షణమున దాటి - రాగలవాడవు
మాకన్నునినిను - ముందు బంపుట
రాజధర్మము - కానేకాదు
అని పలికెడి ఆ - జాంబవంతుగని
అంగదుడెంతో - సంతసించెను

***జాంబవంతుడు హనుమంతుని ప్రోత్సాహించుట***

281. కడుఒంటరిగ - కూర్చొని యున్న
వానరోత్తముని - పవన తనయుని
కార్యశూరుని - శక్తిమంతుని
వజ్రకాయుని - కాంతిమంతుని
జయహనుమంతుని - ప్రేరేపించిన
శతయోజనముల - సంద్రముదాటి
జానకి జాడను - అరసి రాగల
కడు ధీమంతుడు - పావని అనెను

(65వ సర్గ సంపూర్ణం)

## 66వ సర్గ

***జాంబవంతుడు హనుమంతుని జన్మ వృత్తాంతమును దెలుపుట***

282. జాంబవంతుడు - హనుమనుజేరి
ఓ హనుమంతా - ఇటుల ఒంటరిగ
మౌనముగాకూ - ర్చుంటి వదేలా
ఈవననిధిని - దాటగలవారు
కపివీరులందు - ఎవ్వరులేరు
నీవుగాక మరి - ఎవరు దాటెదరు
కావున మాపై - దయగొని లెమ్మా
రామకార్యము - సఫలము జేయుము

283. అమర ధామమున - అప్సరాంగనల
'పుంజకస్థల' యను - అప్సరాంగన
కడుకీర్తిని - అలరారుచుండగా
శాపవశంబున - భూలోకమున
కుంజరుండను - నగచరపతికి
ముద్దుకూతురై - జన్మించినది
అంజనయనెడు - నామముచేత
లోకవిఖ్యాతిగ - వర్ధిల్లినది

284 యుక్తవయస్సు - వచ్చిన వెంటనే
అసమానబలుడు - కేసరి నాముడు
వలీముఖునకు - భార్యయైనది
కుంజరునకు జ - న్మించిన అంజన
కామరూపిణి - సుందరీమణి
ఒక దినంబున - మానవ యువతిగ
భూషణములు - విరి దండలు దాల్చి
గిరిశిఖరిని వి - హరించసాగెను

285. అంజన గిరిపై - తిరుగుచుండగా
వాయువశమున - వసనముతొలగ
బయల్పడెనామె - సుందరాంగములు
అంజన సొగసులు - అందచందములు
గని అనిలుడు స - మ్మోహితు డాయెను
మదనుని శరముల - స్రుక్కిన వాడై
సమీరుడంతట - అంజన భుజములు
కూరిమి మీరగా - కౌగిలించుకొనె

286. అంతట అంజన - సంభ్రమమ్మున
భూరికోపమున - ఇటుల పలికెను
ఎవడు వాడు నా - పాతివ్రత్యమును
దోచుకొనినన్ను - కౌగిలించెననె
అంతట పవనుడు - ఉచిత భంగిని
ఓ విరిబోణీ - నే పవనుడను
చిత్తము నీపై - భ్రాంతినొందెను
దాని ఫలితముగా - కౌగిలించితిని

287 లలిత రూపిణి - భయమొందకుము
నీకు పుణ్యుడు - మహాసత్త్వుడు
త్రిజగముల - ప్ర ఖ్యాత శూరుడు
సుపర్ణవేగుడు - ధీసంపన్నుడు
జగద్ధితుండు - మత్సమానుడు
కీశలలాముడు - జన్మించు నీకని
సర్వమంగళము - లొదవెద వీవని
దీవించిచనె - వాయుదేవుడు

288 మనమున అంజన - కడు ముదమంది
గిరిగుహ యందు - నిన్నుగన్నది
ఒక దినంబున - ఉదయభానుని
గాంచినంతనే - ఫలమని ఎంచి
గగనంబునకు - ఎగసితివీవు
మూడువందల - ఆమడలెగసి
సూర్యుని దిశకు - అరుగు చుండగా
శచికాంతుడు - కడురోష మూనెను

289 ఇంద్రుడాయుధము - విసిరినంతనే
వజ్రహతికినీ - వామహనువుతెగె
గిరగిర తిరుగుచు - ధరపడి నావు
వామహనువు అట - భగ్నమగుటచే
హనుమంతుడవను - నామధేయమున
భువిని ప్రసిద్ధిని - గాంచినాడవు
వాయువునకు - ఔరససుతుడవు
కేసరికి నీవు - క్షేత్రసుతుడవు

290. పురందరుండు - వజ్రాయుధమున
నిన్నుగొట్టుట - గాంచి పవనుడు
ముజ్జగంబుల - వీచుట మానెను
సురాసురాదులు - వ్యాకుల మతులై
పరమేష్ఠిని పలు - విధముల వేడగ
నీరజాసనుడు - దేవతలందరు
అనిలుని పరి పరి -విధముల పొగడగ
రోషము విడిచి - ప్రసన్నుడాయెను

291. నలువవరమిడె - ఏ అస్త్రమునకు
బంధింపబడక - వర్ధిల్లుమని
వజ్రాయుధముచే - హానిలేకుండ
కోరునందాక - మృతిని పొందక
వేయికన్నుల - వేలుపురేడు
ఎంతో ప్రీతిగ - వరమునొసగెను
అష్టదిక్కుల - అధిపతులందరు
పలువరంబులు - ఒసగిరినీకు

292 ఘనలంఘనమున - లాఘవంబున
అనవతరము - నీ వనిలుని సాటి
తేజంబున ఖగ - రాజువు నీవు
అతులితమైన - నీ బలసంపద
బుద్ధిబలమును - తెలియవదేల
వననిధి దాటి - లంకాపురిలో
సీతజాడగని - వేగమెరమ్ము
రఘురాముకు - సుగ్రీవుడిచ్చిన
మాటను నిలిపి - మము కాపాడుము

293 సీతను లంకలొ - గాంచి వచ్చిన
జీవింతుము నీ - పుణ్యము చేత
ఆమెను గాంచక - మరలి వచ్చిన
మరణింతుము - సుగ్రీవుని చేత
వానరవీరులు నీ - జవ సత్త్వములను
కన్నులార గన - కాచి యున్నారు
అని పావనిని - జాంబవంతుడు
పలు విధముల - పురి కొల్పినప్పుడు

(66వ సర్గ సంపూర్ణం)

## ౬౭వ సర్గ

### హనుమంతుడు వారిధిని దాటగ విజృంభించుట

294 జాంబవంతుని - పలుకులను విని
హనుమంతుడు - ఉత్తేజితుడాయెను
గిరి, ముఖమ్మున - విజృంభించెడి
సింహరాజువలె - నాదము జేసెను
ముజ్జగంబుల - నిండిపోయిన
త్రివిక్రమునివలె - తనువు పెంచెను
వృద్ధకీశులకు - అంజలులొసగి
జయహనుమంతుడు-ఈ విధిపలికెను

295. ప్రబలవేగుడగు - ఆ ప్రభంజనుని
ఔరససుతుడను - నేను గావున
నాకు సములు కన - రారు జగముల
బలము నందున - వేగము నందున
మహాబలుడు విన - తాత్మజు సాటి
నిమిషమాత్రమున - మింటికి ఎగసి
కడలి దాటి - సీతమ్మను గాంచి
మీకు ముదమ్మును - నే గూర్చెదననె

296 ఓ పవనసుతా - ఈ ధరయందున
నీతోసములు - ఎవ్వరు లేరు
నిన్నుగాంచిన - ఈ హరి ముఖ్యుల
దారుణశోకము - బుద్బుదమయ్యె
తిరిగినీవిటకు - చేరువరకును
మే నిలిచెదము - ఏకపాదులై
గురుమునివరుల - ప్రసాదము వలన
సంద్రము దాటి - కీర్తినొందెదవు

297 అని పలికెడి ఆ - జాంబవంతుగని
నా లంఘనకు - ఈయిల జాలదు
మహేంద్రగిరి - శిఖరమ్మునుచేరి
నే లంఘించెద - లంకాపురికని
ఇంత వటుడుగా - వచ్చినవాడు
అంతకంతకూ - పెరిగినట్లుగా
లంకాద్వీపము - గాంచునెపమ్మున
జయ హనుమంతుడు- కాయము పెంచెను

**హనుమంతుడు మహేంద్రగిరి నధిరోహించుట**

298 మహేంద్రంగిరిని - అధిరోహించగ
శిలలు పగిలెను - ధాతువు లెగసెను
ఘన సర్పంబులు - బుసలు కొట్టుచు
విషముగ్రక్కగా - మంటలు రేగెను
ఆగిరియందున - భూతములన్నియు
భయపడి గిరిని - వదిలి పరుగిడె
సుందర మారుతి - సుందర రూపము
వెలుగులు జిమ్మె - జగమంతటను

(67వ సర్గ సంపూర్ణం)

**కిష్కింధకాండ సమాప్తము**

నమోస్తు రామాయ, సలక్ష్మణాయ
నమోస్తు దేవ్యై, జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మ బువేవరాయ
నమోస్తు వల్మీకి బహాయ తస్మై

## ఈ గానసుధకు విరాళములు అందజేసిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ వరాలం పీరన్న | —— | 116-00 |
| శ్రీ కొల్లూరు రామారావు | —— | 116-00 |
| శ్రీ కె కిరీటి | —— | 116-00 |
| శ్రీ బి యమ్ కృష్ణమూర్తి | —— | 116-00 |
| శ్రీ ఎమ్ ప్రకాశరావు | —— | 116-00 |
| శ్రీ సి హెచ్ రమణయ్యపంతులు | —— | 116-00 |
| శ్రీ ఎస్ సత్యనారాయణ | —— | 116-00 |
| శ్రీ లకుండి చినకామేశ్వరరావు | —— | 116-00 |
| శ్రీ ఎన్ ఎస్ ఆర్ శర్మ | —— | 101-00 |
| శ్రీ డి సత్యంరావు | —— | 58-00 |
| శ్రీ ఎ యస్ రఘురాం | —— | 58-00 |
| శ్రీ బి వసంతరావు | —— | 58-00 |
| శ్రీ ఎస్ భాస్కరరావు | —— | 58-00 |
| శ్రీ వి నరసింహారావు | —— | 58-00 |
| శ్రీ డి యమ్ నాయక్ | —— | 58-00 |
| శ్రీ ఎ విజయకుమార్ | —— | 58-00 |
| శ్రీ కె సూర్యనారాయణ | — | 58-00 |
| శ్రీ పి ఎ ఎరక్ | —— | 58-00 |
| శ్రీ ఆర్ ఎ పంతులు | —— | 58-00 |
| శ్రీ కె సుబ్బారావు | —— | 58-00 |
| శ్రీ బి ఎ కృష్ణ | —— | 58-00 |
| శ్రీ ఎ రామచంద్రరావు | —— | 58-00 |
| శ్రీ జి వి గోపాలరావు | —— | 58-00 |
| శ్రీ జి రామనారాయణ | —— | 58-00 |
| శ్రీ గంగాధరరావు | —— | 58-00 |
| శ్రీ డి వి రమణ | —— | 58-00 |
| శ్రీ ఎ హరనాధరావు | —— | 58-00 |
| శ్రీ హెచ్ గౌరీపతిరావు | —— | 58-00 |
| శ్రీ బి ఎ రమణ | —— | 58-00 |
| శ్రీ ఎ ఇన్నారెడ్డి | —— | 58-00 |

## గ్రంథకర్త పరిచయం

| | |
|---|---|
| గ్రంథకర్త | **పి యల్ నారాయణరావు** |
| స్వస్థలం | రైల్వే న్యూకోలనీ విశాఖపట్టణం |
| పుట్టిన తేది | 8-11-1940 |
| సతీమణి | సౌ॥ శ్రీమతి గిరిజ |
| తల్లిదండ్రులు | కీ॥శే॥ ''సహజకవి' పంతుల చినజోగారావు<br>కీ॥ శే॥ సుభద్రమ్మ |

**మొదటి సుందరకాండ గానం**

29 2 1992 శ్రీ సద్గురుబ్రహ్మ రామదూత మందిర ప్రాంగణం
మధురానగర్, విశాఖపట్నం

**సన్మానాలు పురస్కారములు**

1974 ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ శ్రీ ఎమ్ ఆర్ అప్పారావు గారు
1980 1984 పద్మశ్రీ ఘంటసాల కల్చరల్ అసోసియేషన్, యలమంచిలి
1981 విశాఖ Insustrial and Commercial Exhibition
1981 Lion Ladies Auxiliary Visakha North
1984 సంగీత సంగమం జమ్‌షెడ్‌పూర్
1985 మద్రాస్ తెలుగు అకాడమీ
1992 Food Corpn of India Ltd
1992 రాగతరంగిణి, బరంపురం
1995 సర్వెంట్సు ఆఫ్ గాడ్స్ సొసైటీ **అభినవ ఘంటసాల**
1996 స్వరరంజని & సమన్వయ సమితి, విశాఖపట్నం
**పావని సుందరగానలోల** బిరుదు ప్రదానం
1997 శ్రీ కోరిమిల్లి వీరభద్రరావు మెమోరియల్ & కల్చరల్ & ఎడ్యుకేషనల్ ట్రస్టు యలమంచిలి వారిచే **గురజాడ అవార్డు** 1998 సన్మానం కళావేదిక, విశాఖ
1999 **కళారత్న** బిరుదు ప్రదానం
6-2-2000 చైతన్య స్రవంతి పర్లాకిమిడి

***ఇతర అముద్రిత రచనలు***

శ్రీ రామాయణ గాన సుధలో బాల అరణ్య,
మరియు యుద్ధకాండలు
శ్రీ షిరిడిసాయి అమృత వర్షిణి
లలిత, భక్తి గీతాలమాల

## 64వ సర్గ

**వానరులు సముద్రతీరము జేరుట**

274 పక్షిరాజు సం - పాతి చెప్పిన
జానకి జాడను - తెలిసిన కపులు
దిక్కులదరగా - సింహ నాదములు
జేయుచు ఎగసిరి - గగన తలమునకు
వాయువేగులై - త్రుటిలో చేరిరి
దక్షిణ సముద్ర - ఉత్తర దిశకు
విశాలమైన - వననిధి గాంచి
కలవరమందిరి - కపులందరును

275 అంబరచుంబి - తరంగ పంక్తిచే
మీన కూర్మ మక - రాది మహోజ్వల
సత్త్వకోటిచే - కడు భీకరమగు
సంద్రముగాంచి - సందేహించిరి
మతిమంతుండు - మహాబలుండగు
వాలి తనయుడు - వానరులగని
ఏల విషాదము - బొందెదరిపుడు
భావి కార్యమును - చింతన జేయుడు

222 ముప్పదిదినములు - ముగియకమునుపే
వినతాదులొచ్చె - తూరుపునుండి
పశ్చిమమునుండి - సుషేణుడు వచ్చెను
శతవలివచ్చెను - ఉత్తరమునుండి
వారలందరూ - కపిరాజును గని
వారు వెడలిన - తావులన్నియును
విన్నవించిరి - కడు విశదముగా
భూమిజ జాడను - అరయగలేక
నిరాశతో తా - వెను దిరిగితిమని
సుగ్రీవునకు - వినతి జేసిరి

(47వ సర్గ సంపూర్ణం)

కిష్కింధాకాండము